


# యజ్ఞోపవీత వైశిష్ట్యము

## బ్రహ్మచర్య విశిష్టత




కర్త :

సుమ్నార్థి

(డా. కోదూరి సుబ్బారావు)



ఓం ఇయం సమిత్ పృథివీ ద్యౌర్ ద్వితీయా ఉతాన్తరిక్షం సమిధా పృణాతి ।
బ్రహ్మచారీ సమిధా మేఖలయా శ్రమేణ లోకాంస్తపసా పిపర్తి॥

– అథర్వవేదం (11-5-4).

<u>భావార్థం :-</u> బ్రహ్మచారి లేదా బ్రహ్మచారిణిలు(విద్యార్థి విద్యార్థినులు) 3 సమిధలను తీసుకొని గురువుగారికి సమర్పించి విద్యాదానం చెయ్యమని కోరాలి. అవి ఏమి సూచిస్తాయంటే-

మొదటి సమిధ భూలోకాన్ని, రెండవది ద్యులోకాన్ని - సూర్యనక్షత్ర లోకాన్ని, మూడవది ఆ రెండిటి మధ్య ఉన్న అంతరిక్షాన్ని సూచిస్తుంది. బ్రహ్మచారులు తాము విద్యార్థులుగా గురుకులవాసం చేస్తూ నిత్యం గురువుగారు చేసే నిత్యాగ్ని హోత్రంలో పాలుపంచుకుంటూ త్రిలోకాలలో ఉండే సామాన్య అగ్ని, జాతవేదాగ్ని, అంగిరాగ్నులను దీప్తిమంతం చెయ్యాలి. తద్వారా తమ శరీర మనోబుద్ధులను దీప్తిమంతం చేసుకోవాలి. ఇంతేగాక, మేఖలతో (కటిబద్ధతతో) పరిశ్రమతో, తపస్సుతో తమ జీవితాలను, తోటి ప్రజల జీవితాలను పిపర్తి = పాలించి పోషించుకుంటూ పూర్ణత్వాన్ని పొందాలి.

This first stick stands for earth, the second for sun & stars, and he fills weather with third. The Vedic student with this fuel for the HAWAN, with his (her) girdle (waist Belt), his hard work and his austerity (Brahma Charya) renders all the worlds perfect.

N.B :- Three sticks give the idea that through them the Brahmachari attain the knowledge of these three regions which include all the spheres of knowledge.




# యజ్ఞోపవీత వైశిష్ట్యము
# బ్రహ్మచర్య విశిష్టత

(అనుబంధం : బ్రహ్మచర్య, మేధా సూక్తులు)




కర్త :

**సుమ్నార్థి**

(డా. కోడూరి సుబ్బారావు)

**గాయత్రి ఆశ్రమ ట్రస్టు ప్రచురణ**

గాయత్రీ గ్రంథమాల : 64

# యజ్ఞోపవీత వైశిష్ట్యము

# బ్రహ్మచర్య విశిష్టత

(అనుబంధం : బ్రహ్మచర్య, మేధా సూక్తులు)

ప్రతులు : వెయ్యి

సృష్టి సంవత్సరము : 197, 29, 49, 117.
విక్రమాబ్దము : 2072.
దయానందాబ్దము : 192.

శ్రీ దుర్ముఖి నామ సంవత్సరం, ఆశ్వీయుజ పౌర్ణమి.
తేది : 16-10-2016.

**మూల్యము : మీరు పూర్తిగా చదివి మరొకరికి యిచ్చి చదివించటం**

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు అనుమతితో**

ముద్రణ - వితరణ :
**రావికంటి జ్యోతిశ్రీ - దీనదయాళ్**
వైదికధర్మ ప్రచారకులు
వారాసిగూడ, సికింద్రాబాద్

**డి.టి.పి. & ప్రింటింగ్ :**
**విక్రాంత్ ప్రింట్ హౌస్,**
వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.
ఫోన్ : 9705085608.

# అభినందనలు - ఆశీస్సులు

చి. రావికంటి దీనదయాళ్, సౌ. జ్యోతిశ్రీ దంపతులిరువురు నిష్ఠాపరులైన ఆర్యపరివారాలలో పుట్టి పెరిగినవారే. చి. దీనదయాళ్ శ్రీమాన్ రావికంటి కృష్ణమూర్తి , శ్రీమతి సుశీలమ్మ దంపతుల తృతీయ పుత్రునిగా సీతాఫలమండి, సికింద్రాబాద్‌లో జన్మించారు. సౌ. జ్యోతిశ్రీ పిట్లం గ్రామంలో (నిజామాబాద్ జిల్లాలో) శ్రీమాన్ మండలి నారాయణ, శ్రీమతి విమలమ్మ గార్ల కనిష్ఠ పుత్రికగా జన్మించినది. చి. దీనదయాళ్ బి.కాం., ICWAI Inter వరకు చదువుకొని "విక్రాంత్ ప్రింట్ హౌస్" పేరుతో ఒక ముద్రణాలయాన్ని నడుపుకుంటున్నారు. మా సీతాఫలమండి ఆర్యసమాజం ద్వారా ప్రచురించబడుచున్న మాసిక కరపత్రాలను, పుస్తకాలను శ్రద్ధా భక్తులతో ముద్రించి యిస్తున్నారు. అట్లే, మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టునకును అవసరమైన ముద్రణలు చేస్తూ సహకరిస్తున్నారు. శ్రీమతి జ్యోతిశ్రీ పిట్లం గ్రామంలో 7వ తరగతి చదువుకొని అనంతరం వారణాశి యందు ఆచార్య ప్రజ్ఞాదేవి గారిచే నడుపబడిన పాణిణి కన్యామహావిద్యాలయము మరియు ఆర్య కన్యా గురుకులం ఆచార్య శాంతి దేవి ఆర్యకన్యాగురుకులంలో హరియాణా మరియు ఆర్ష గురుకులం వడ్లూర్ కామారెడ్డి ఆచార్య వేద్‌వ్రత్ మీమాంసక్ వేద్యాధ్యయనం 12 సంవత్సరాలు చేశారు. అనంతరం వివాహం తరువాత సంస్కృతంలో M.A. డిగ్రీ మరియు హిందీ పండిత్ చేశారు. ప్రస్తుతం వైదిక విద్యాలయ హైస్కూల్‌లో హిందీ టీచర్‌గాను, ధార్మిక శిక్షకురాలుగాను పనిచేస్తున్నారు. మాతృభాష తెలుగుతోబాటు హిందీ, సంస్కృత భాషలలోను ప్రావీణ్యత ఉండటంవల్లను, చక్కటి ప్రవచనశైలి ఉండటంవల్లను వైదిక ప్రవక్తగా, పురోహితగా చక్కటి గుర్తింపు పొందారు. వీరికి నా అభినందనలు.

ఈ దంపతులకు వరుసగా ముగ్గురు (3) మగపిల్లలు కలిగారు. వారికి వరుసగా "విక్రాంత్, విఖ్యాత్, విశ్రుత్" అని నామకరణాలు చేశారు. ముగ్గురి పేర్లలోను మొదటి అక్షరం 'వి' కావటం విశేషం. వారిని విశేష వ్యక్తులుగా తీర్చిదిద్దాలని తల్లిదండ్రుల అభిలాషకావచ్చు. 'విక్రాంత్' అంటే విశేషంగా పురోగమించువాడనీ,

విఖ్యాత్ అంటే విశేషమైన కీర్తిగలవాడనీ, విశ్రుత్ అంటే విశేషంగా వేదాది సత్యశాస్త్రాలను శ్రవణం (వినటం) చేసినవాడని అర్థం. ఈ పేర్లకు మరికొన్ని అర్థాలు చెప్పవచ్చు. తల్లిదండ్రుల ఈ సాత్విక సంకల్పాన్ని సర్వవ్యాపక సర్వేశ్వరుడు సఫలము చేయునుగాక ! వీరికి నా ఆశీస్సులు.

వారు ఈ ముగ్గురు పిల్లలకు ఆశ్వీయుజ పూర్ణిమ ఆదివారం (16-10-2016 తేదీ) ఉపనయన వేదారంభ సంస్కారాలు నేను ప్రస్తుతం నివసిస్తున్న వైదిక వానప్రస్థ సాధకాశ్రమము - వైదిక యజ్ఞశాల (హనుమాపురం, భువనగిరి) లో జరిపించాలని సంకల్పించటం నాకు మహదానందాన్ని కలిగించింది. ఎందుకంటే వారు వేరొక చోట ఏర్పాటు చేసివుంటే నేను వెళ్ళగలిగే వాడినో లేదో కదా ! ఆ సందర్భంలో నా రచన "యజ్ఞోపవీత వైశిష్ట్యము" ముద్రణచేసి వితరణ చేసుకుంటామని నా అనుమతిని కోరారు. నేను సంతోషంగా అంగీకరించటమే కాక దానిలో బ్రహ్మచర్యాన్ని గూర్చి వ్రాసిన 2 కరపత్రాలను, యజ్ఞోపవీతాన్ని గురించిన మరొకొన్ని మాటలను, బ్రహ్మచర్య మేధాసూక్తాలను కూడా కలిపి ముద్రిస్తే బాగుంటుందని సూచించాను. వారు సంతోషంగా అంగీకరిస్తూ ఈ చిన్నపుస్తకాన్ని ముద్రించి మీ అందరకు కానుకగా వితరణ చేస్తున్నారు.

ఈ చిన్నపుస్తకాన్ని విద్యార్థులు, విద్యావంతులు అందరూ చదివి యజ్ఞోపవీతాన్ని విద్యాచిహ్నంగా, దేవ, ఋషి, పితృ, ఋణ విముక్తికై దీక్షాకంకణంగా గుర్తించి విద్యావంతులైన స్త్రీపురుషులంతా ధరిస్తారని ఆశిస్తున్నాను. ముఖ్యంగా విద్యార్థినీ విద్యార్థులు బ్రహ్మచర్య అవసరాన్ని గుర్తించి అనుసరిస్తారని ఆశిస్తున్నాను. సర్వాంతర్యామియైన ఓం నామక పరమేశ్వరుడు వారికి అట్టి ప్రేరణను కలిగించునుగాక.

మరొకసారి చి.దీనదయాళ్, సౌ. జ్యోతిశ్రీ గార్లకు, పిల్లలకు నా అభినందనలు, ఆశీస్సులు. ప్రూఫ్ దిద్దుటలో సహకరించిన ఆర్య సమాజం, సీతాఫలమండి కార్యదర్శి గారైన శ్రీ డి. గంగాధర్ గారికి నా ధన్యవాదములు.

వైదిక వానప్రస్థ సాధకాశ్రమం,
శ్రీదుర్ముఖి సం॥ విజయదశమి

**సుమ్మార్థి**
(డా. కోడూరి సుబ్బారావు)



# యజ్ఞోపవీత వైశిష్ట్యము

'యజ్ఞోపవీతం' అను పదము యజ్ఞ + ఉప + వీతం అను మూడు పదముల కలయికచే తయారగును. అందు యజ్ఞ పదము 'యజ్-దేవపూజ, సంగతికరణ, దానేషు' అను ధాతువుతో సిద్ధమగును. అందుచే యజ్ఞ మనగా దేవతలను పూజించుట, సత్కరించుట, మానవులలోని వివిధ శక్తులను సంఘటితపరచి ఉత్తమ ప్రయోజనమును సిద్ధింపజేయుటకై పరిశ్రమించుట, దాతృ త్వ బుద్ధితో తన మనోవాక్కా యములను తోటి ప్రజల ప్రయోజనమునకై అర్పించుట యగును. ఒక్క మాటలో చెప్పవలెననిన "యజ్ఞో వై శ్రేష్ఠతమం కర్మ"- తనకు, యితరులకు మేలుచేయు ఉత్తమోత్తమ కర్మ యజ్ఞ మనబడును. అట్టి యజ్ఞమయ జీవితము గడుపుటకు సంకల్పించి దానిని వ్రతముగా స్వీకరించు వ్యక్తులు వ్రతసూత్రముగా ఈ ఉపవీతమును ధరించవలెనని ఋషుల అభిమతము. ఉపవీత మనగా, ఉప- సమీపమునకు, వీత - చేర్చునది. శుభకర్మలకు దగ్గరగా చేర్చునది. అట్టి సూత్రము సదా మానవునకు తన వ్రతమును గుర్తు చేయుచు ఎడమ భుజముపై నుండి కుడివైపు అడ్డముగా వ్రేలాడవలెనని దీని నిర్మాణము జేసిరి. అప్పుడది గుండె మీదుగా హృదయ గుహ యందలి అణుస్వరూప జీవునిపైనుండి జీవుడు ధరించునట్లు వ్రేలాడును. ప్రాణశక్తి కేంద్రమైన నాభిని తాకుచు కుడివైపు కటి ప్రదేశమున అంతమగును. అట్టి వ్రతమును దీక్షతో నెరవేర్చుటకు కటిబద్ధుడు కావలెనని ప్రేరణనిచ్చును. నడుము బిగించి తన పూర్ణశక్తి సామర్థ్యములతో యజ్ఞమయ జీవితము గడుపవలెనని ప్రబోధించును.

దీనివలన ఒక భౌతిక ప్రయోజనముకూడ గలదు. మన శరీరము లోపల వీపుపైనుండి ఎడమ భుజము మీదుగా అడ్డముగా కటి ప్రదేశము వరకు విల్లువలె నుండు ఒక ప్రాకృతిక రేఖ గలదనియు అది మానవులలో విద్యుత్తు నుత్పన్నము చేసి యింద్రియములలో ఉష్ణతను, ఉద్రేకమును కలిగించుననియు, దానివలన కామ క్రోధములు ఉద్రేకించుననియు కొందరి వైజ్ఞానికుల కథనము. అయినను

ఇది లాజవంతి (Touch me not) ఓషధివలె స్పర్శ మాత్రమున ముకుళించు (శాంతించు) స్వభావము గలదట. అందుచే యజ్ఞోపవీతము ఆ ప్రాకృతిక రేఖను మృదువుగా స్పర్శించుచు అదుపులో ఉంచి మానవుని కాముకునిగా, క్రోధితునిగా, హింసకునిగా కాకుండా కాపాడునని యందురు.

ఋషులు యజ్ఞోపవీతమును ధరించునపుడు దాని ప్రయోజనమును గుర్తింపజేయు విజ్ఞానమునంతను మంత్రబద్ధముజేసి వినియోగ మంత్రముగా చెప్పుకొనవలెనని నిర్దేశించిరి. ఆ మంత్రము–

**"యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్**
**సహజం పురస్తాత్ ।**
**ఆయుష్య మగ్ర్యం ప్రతిముఞ్చ శుభ్రం యజ్ఞోపవీతం**
**బలమస్తు తేజః ॥** (పా. గృ. 2-2-10)

యజ్ఞోపవీతం = యజ్ఞములను (శుభకర్మలను) చేయుటకు ధరించు ఈ వ్రతసూత్రము, పరమం పవిత్రం= పరమ పవిత్రమైనది. ప్రజాపతేః ప్రజాపతియైన పరమేశ్వరుని చేర్చుటకు, యత్= ఏది సహకరించునో, సహజం = తల్లి గర్భములో బొడ్డు త్రాడుగా సహజముగా, పురస్తాత్ = జన్మించక ముందు నుండి యుండునో అది, ఆయుష్యం = ప్రాణశక్తిని బలపరచి దీర్ఘాయువు నిచ్చును, అగ్ర్యమ్ = అగ్రేసరత్వమును . అన్ని రంగములలో యున్నతిని కలిగించును, ప్రతిముంచ శుభ్రమ్ = శుభకర్మలకు భిన్నమైన చెడుగులనుండి విడిపించి మేలు చేయును. యజ్ఞోపవీతం= అట్టి యజ్ఞోపవీతము (నాకు) బలమస్తు తేజః = తేజస్సు నిచ్చు శారీరక, మానసిక, ఆత్మిక బలములను ప్రసాదించును గాక.

ఈ మంత్రార్థములోని ఔచిత్యమును గూర్చి ఆలోచింతము -

**యజ్ఞోపవీతం** : (యజ్ఞాయ ఉపవీతం) జీవరాశులలో మానవజన్మ బహు మూల్యమైనది. పది యింద్రియములు, బుద్ధి వికసించి యుండును. ఈ జన్మ పూర్వజన్మల సుకృత ఫలము. ఈ జన్మలో గాని, పూర్వజన్మలో గాని జేసిన సుకృత, దుష్కృతముల ఫలమే మనకు కలుగు సుఖ దుఃఖములు. సుఖములను కాంక్షించు

మానవునికి శుభ కర్మాచరణయే వాటిని పొందు యేకైక మార్గము. ఇది తెలిసియు మానవులు పూర్వ వాసనాబలముతో యింద్రియలోలురై పాపకర్మల యందు ప్రవృత్తు లగుచుందురు. అందుచే ప్రయత్న పూర్వకముగా శుభకర్మల జేయ వ్రతశీలుడు కావలెనని వేదాదేశము. అట్టి వ్రతశీలుడు క్రమముగా -

**వ్రతేన దీక్షా మాప్నోతి, దీక్ష యాప్నోతి దక్షిణామ్ ।**

**దక్షిణా శ్రద్ధామాప్నోతి, శ్రద్ధయా సత్యమాప్యతే ॥**(యజు. 19.30)

దృఢ సంకల్పము వలన సంకల్పించిన కార్యాచరణయందు దీక్షను పొందును. దీక్ష వలన దక్షిణను - లాభమును, సత్కారమును పొందును. లాభము కలిగిన తదుపరి దాని యందు శ్రద్ధ యేర్పడును. శ్రద్ధ వలన సత్యమును - పూర్ణ సఫలతను పొందును. క్రమముగా పరమేశ్వర ప్రాప్తిని పొందును.

ఆర్యులు ఆ వ్రతమును (దృఢ సంకల్పమును) మాటిమాటికి గుర్తు చేసుకొనుటకు దీక్షా కంకణముగా ఈ సూత్రమును ధరింతురు.. శుభకర్మల సమగ్ర స్వరూప సూచకమే ఈ యజ్ఞోపవీతము.

యజ్ఞ మనగా శుభకర్మలని అర్థము తెలిసినను ఆ శుభకర్మ లెవ్వియో, ఏ కర్మలవలన మానవునికి యున్నతి కలుగునో, ఏది మానవుడు ఆవశ్య మాచరింపవలెనో వివరముగా తెలిసికొనవలసి యున్నది. ముందుగా ఆవశ్య మాచరించవలసిన కర్మల గూర్చి తెలుసుకొందము. ప్రతి మానవుడు (స్త్రీలు, పురుషులు) మూడు ఋణములతో జన్మింతురు. "జాయమానో వై నరః త్రిభిః ఋణవాన్ జాయతే" అవి ఏవి యన-

**1. పితృ ఋణము :** మనను కని, పెంచి, పెద్దజేసి విద్యా బుద్ధులను, ఆస్తిపాస్తులను యిచ్చి మన కొరకు ఎన్నెన్నో త్యాగములు చేసిన తల్లిదండ్రులకు మనము ఎంతగానో ఋణపడి యుందుము. ఆ ఋణమును తీర్చుకొనుటకు వారికి ప్రియముగా మెలగుచు అవసరమైనపుడు సేవలు చేసి ఆదరించవలెను. అప్పుడే ఆ ఋణము తీరును.

**2. దేవ ఋణము :** పంచభూతములను జడదేవత లందురు. అనగా జ్ఞానరహిత దేవతలు. పంచభూతముల వలననే మన ఈ శరీరమేర్పడి పెరిగిపెద్దదై వాటియందే జీవించు చుండును. కాని మన శరీరము నుండి వెడలు మల మూత్ర స్వేద

నిశ్వాసములతో వాటిని మలినపరచి వాటికి ఋణగ్రస్తుల మగుచుందుము. ఆ ఋణము తీరుటకు నిత్యము ఉదయ సాయంకాలములందు అగ్నిహోత్రము చేయవలెను. అగ్ని హోత్రము జల, వాయు, భూ కాలుష్యములను నివారించు ఒక అద్భుత వైజ్ఞానిక ప్రక్రియ. దీనిని వివరముగా తెలుసుకొనగోరువారు నాచే రచింపబడిన "అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం" అను పుస్తకమును చదువగోరెదను.

**3. ఋషి ఋణము :** పరమేశ్వరుని ద్వారా వేద జ్ఞానమును గ్రహించి గురు శిష్య, పరంపరగా భావితరముల కందజేయుచు వచ్చిన ఋషులకు (గురువులకు) మనము ఋణపడి యున్నాము. ఆ విధముగా మనకు జ్ఞానము లభించకున్న పశు పక్ష్యాదుల కన్న హీనముగా జీవించెడి వారము. వారి ఋణము తీర్చుకొనుటకు మనము కూడా విద్యావంతులము, జ్ఞానవంతులమునై ఆ జ్ఞానమునకు మన అనుభవమును చేర్చి ముందు తరముల కందజేయవలెను.

పై మూడు ఋణముల భారము మన భజస్కంధములపై నున్నదని గుర్తు జేయుచు ఈ మూడు ప్రోగుల యజ్ఞోపవీతము వ్రేలాడు చుండును. వాటి విముక్తికై జేయు పంచమహా యజ్ఞములు అనగా సంధ్య, అగ్నిహోత్రము, జీవిత పితరుల (తల్లిదండ్రుల) సేవ, ఆశ్రయించుకొని ఉన్న అల్ప ప్రాణులకు బలివైశ్యదేవము (ఆహార మిడుట), అతిథుల (సాధు సంన్యాసుల) ఆదర సత్కారములు మానవుడు అవశ్య మాచరించవలసిన కర్మలు.

పరమ ఆప్తుడైన పరమేశ్వరుడు శ్రుతుల (వేదముల) ద్వారాను, ఋషి మునులు స్మృతుల (బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషదాదుల) ద్వారాను మానవోన్నతికి తోడ్పడు మార్గముల (యజ్ఞముల) నెన్నిటినో ఉపదేశించిరి. వాటిని తెలుసుకొని ఆచరించుటకు దీక్ష వహించితినని ఈ యజ్ఞసూత్రము గుర్తు చేయుచుండును.

**పరమం పవిత్రమ్ :** పవిత్ర మనగా "పూయతేఽనేన ఇతి పవిత్రమ్" ఏది మానవులకు సదా తనను పవిత్ర మొనర్చు సాధనములను గుర్తు జేయునో దానిని పవిత్ర మందురు. పవిత్ర మొనర్చు సాధనము లెవ్వియో మనువు చాలా చక్కగా వివరించెను. అవి యెవ్వియనగా–

**అద్భిర్ గాత్రాణి శుద్ధ్యన్తి, మనః సత్యేన శుద్ధ్యతి ।**

**విద్యాతపోభ్యాం భూతాత్మా, బుద్ధిర్ జ్ఞానేన శుద్ధ్యతి ॥** (మను. 2-97)

నీటి వలన (స్నానాదుల వలన) శరీరాంగములు, సత్యభాషణ వలన మనసు, కర్తవ్యాకర్తవ్య, ధర్మాధర్మ, ఆత్మానాత్మ వివేకజ్ఞానము వలన బుద్ధి, విద్య తపస్సుల వలన జీవాత్మ శుద్ధము లగును. విద్య యనగా ప్రకృతి, జీవాత్మ, పరమాత్మల యథార్థ జ్ఞానము. తపస్సు అనగా యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధు లను అష్టాంగయోగ సాధనములతో యోగాభ్యాసం చేయుట.

"ఓం భూః పునాతు శిరసి, భువః పునాతు నేత్రయోః, స్వః పునాతు కంఠే, మహః పునాతు హృదయే, జనః పునాతు నాభ్యామ్, తపః పునాతు పాదయోః, సత్యం పునాతు పునశ్శిరసి" అని ఉదయ సాయం సంధ్యలలో యింద్రియ పవిత్రతకు పరమేశ్వర సహాయమును కోరుచు ప్రార్థన చేయవలెను. అట్టి పవిత్రత కొరకు ప్రేరణనిచ్చు వానిలో యజ్ఞోపవీతము పరమం-శ్రేష్ఠమైనది.

**ప్రజాపతేః యత్ :** ఏది ప్రజాపతిని చేర్చునో అది. జీవులమైన మనమంతా పరమేశ్వరుని ప్రజలము. ఆయన మనకు పతి - పాలకుడు - రక్షకుడు. మనము చేయు శుభాశుభ కర్మలకు న్యాయ రూప ఫలము నిచ్చుటకై ఈ సృష్టిని - పశుపక్ష్యాది ప్రాణి జాతులను సృజించి పాలించుచుండును అతడు ఆనంద స్వరూపుడు. పూర్ణసుఖ స్వరూపుడు. కాని మనము అతనిని మరచి ఈ శరీరముతోను, శరీరముతో సంబంధించిన బంధు మిత్ర పరివారముతోను రాగమును పెంచుకొని వాటికొరకై మంచి మార్గమున, చెడు మార్గమునకూడ శ్రమించు చుందుము. ఇంద్రియములతో లభించు అల్ప సుఖముల వెంట పరుగులెత్తు చుందుము. అవి లభించిన అల్ప సుఖమును బొందుదుము. లభించకున్న రాగద్వేషములతో తపించుచుందుము. అట్టి సమయములలో ఈ యజ్ఞోపవీతము వెన్ను తట్టి మేల్కొల్పి, పూర్ణానంద స్వరూప ప్రజాపతిని గుర్తు చేసి అటువైపు నడిపించును. అందుచే అది ప్రజాపతిని చేర్చు సూత్రము.

**సహజం పురస్తాత్ :** జన్మించకముందు తల్లిగర్భములో బిడ్డకు ఈ ఉపవీతము

సహజముగా - ప్రాకృతికముగా నుండును గర్భిణి గర్భములో బిడ్డ జరాయువు (placenta) అను సంచిలో పెరుగు చుండును. అందు బిడ్డకు వత్తిడి తగలకుండా ఉమ్మనీరు (Amniotic fluid) అను ద్రవము ఉండును. ఆ ద్రవములో తేలియాడు బిడ్డకు పోషకాహారము, ప్రాణవాయువులతో కూడిన రక్తము బొడ్డు త్రాడు (umbilical cord) ద్వారా అందుచుండును. వాటితోనే బిడ్డ పెరిగి పెద్దదగును. అప్పుడా బిడ్డకు బొడ్డుత్రాడు యజ్ఞోపవీతమువలె నుండును. దానినే సుశ్రుతాచార్యుడు ఈ విధముగా వర్ణించెను.

"మాతుస్తు ఖలు రసవహాయాం నాడ్యాం గర్భనాభి నాడీ ప్రతి బద్ధా భవతి, సాऽస్య మాతురాహార రసవీర్య మభివహతి తేనోపస్మే హేనాస్యాభి వృద్ధిర్భవతి (శరీర స్థానము సూత్రము-17)."

తల్లియొక్క రసవాహనాడి యందు గర్భస్థ శిశువు యొక్క నాభినాడి (నాళము) అతుకుకొని యుండుటచే తల్లి వలన భక్షింపబడిన ఆహార రసము ఆ నాభి మార్గమున గర్భస్థశిశు శరీరమును వృద్ధి చేయుచుండును.

ఎట్లు తల్లి గర్భములో బిడ్డకు బొడ్డుత్రాడు రస ప్రాణముల నిచ్చి కాపాడుచుండునో అట్లే ఈ యజ్ఞోపవీతము మానవునకు వేదోపదేశరూప రస ప్రాణముల నిచ్చి జీవితాంతము కాపాడుచుండును. అందుచేతనే 'సహజం పురస్తాత్' ఉపవీతము జన్మతోనే (By Birth) సహజముగా పరమేశ్వరుని నుండి లభించునని చెప్పబడినది.

**ఆయుష్యమ్ :** గర్భములో ప్రవేశించినది మొదలు మరణము వరకు ఉండు దానిని ఆయు వందురు. అట్టి ఆయువునకు నిమిత్త కారణమును "ఆయుష్యమ్" అందురు. అనగా దీర్ఘాయువునకు కారణమైనది, ఆయువును వృద్ధి పరచునది యని అర్థము. దుర్లభమైన మానవ జన్మను పొందియు అల్పాయుష్కుడు, అల్పశక్తిమంతుడు, అల్పమైన యింద్రియ పటుత్వము గలవాడు యేమి ప్రయోజనమును పొందును? అందుచే మానవుడు పురుషార్థముతో పూర్ణాయువును, పూర్ణ శక్తిని, పూర్ణ యింద్రియ పటుత్వమును పొందవలెను. ఉదయ సాయం సంధ్యలలో "పశ్యేమ శరదః శతమ్, జీవేమ శరదః శతమ్, శృణుయామ శరదః శతమ్, ప్రబ్రవామ శరదః శతమ్,

అదీనాః స్యామ శరదః శతమ్, భూయశ్చ శరదః శతాత్" అను దృఢ సంకల్పము చేయవలెను. అందుకు తగినట్లు ఆరోగ్య నియమములను పాటించుచు సదాచారపరుడు కావలెను.

**"ఋషయోదీర్ఘ సంధ్యా త్వా దీర్ఘమాయు రవాప్నుయుః"** (మను. 4-94).

ఋషులు ప్రాణాయామ పూర్వక దీర్ఘకాల సంధ్యోపాసనలు జేసి దీర్ఘాయువును పొందిరి. మనము కూడ ఆ మార్గమున నడుచుటకు ఈ యజ్ఞోపవీతము ప్రేరణ నిచ్చును. దీర్ఘాయువును బొందుటకు ప్రాణాయామ మొక అద్భుత సాధనము. ప్రాణాయామము వలన అనేక ప్రయోజనములు కలుగును. అది శరీరారోగ్యమునకు చక్కటి వ్యాయామము. దానివలన యింద్రియ పటుత్వము పెరుగును. దీర్ఘ శ్వాసాభ్యాసము వలన ఆయువు పెరుగును. వీటితోపాటు మనో యేకాగ్రత లభించును. పూర్వజన్మలలోని చెడు వాసనలను, మలినములతో కూడిన యింద్రియ దోషములను నివారించుటకు ప్రాణాయామ మొక అద్భుత ప్రక్రియ యని మనువు (మను. 6-71) చెప్పెను.

**అగ్ర్యమ్** : అగ్రేసరత్వము నిచ్చును. ఆర్యులు ప్రతి శుభ కార్యారంభమున నూతన యజ్ఞోపవీతము ధరింతురు. అందుచే శుభకర్మ శీలురకు యిది అగ్ర్యమ్ (మార్గదర్శి)గా నుండును. ప్రారంభించిన శుభకార్యమును గుర్తు జేయుచు దానిని దీక్షతో నెరవేర్చ సదా ప్రేరేపించును. తద్వారా ఆ కార్యమును విజయవంతముగా పూర్తిజేసి సంఘములో అగ్రగామిగా నుండును. యజ్ఞోపవీతము తాను అగ్రముగా నుండి దానిని ధరించు వారిని అగ్రగాములుగా చేయును.

**ప్రతిముఞ్చ శుభ్రమ్** : 'ముఞ్చ' అను పదమునకు వదలుట అని అర్థము. దాని ముందున్న 'ప్రతి' ఉపసర్గ వలన ప్రతిముఞ్చ పదమునకు వ్యతిరేకార్థముగా గ్రహించుట, ధరించుట యని అర్థము వచ్చును. అప్పుడు - శుభమ్ - తెల్లటి, శుద్ధమైన యజ్ఞోపవీతమును గ్రహించుచున్నాను - ధరించుచున్నాను అని అర్థము వచ్చును. యజ్ఞోపవీతము నెప్పుడును శుద్ధముగా నుంచుకొనవలెను. మైలపడిన వెంటనే నూతన యజ్ఞోపవీతమును ధరించవలెను. మల మూత్ర విసర్జన చేయు నపుడు నేలను తాకి మైలపడకుండ జాగ్రత్త వహించవలెను. శుభ్రము అను పదమునకు

తెలుపు అని మరియొక అర్థము గాన పసుపు కుంకుమలు పూయుట సరియైన పద్ధతి గాదు. ఏలయన తెల్లటి వస్త్రముపై యేకొద్ది మురికి చేరినను స్పష్టముగా కనబడును దానిని దూరము జేయుటకు ప్రయత్నింతుము. అట్లే తెల్లటి యజ్ఞోపవీతము మనలోని ఆశుద్ధ భావనలను, కర్మలను గుర్తు జేయుచు వాటి నుండి దూరమై శుద్ధముగా నుండుమని ప్రేరేపించును.

వైదిక భాషలో శుభ్ర మను పదమునకు ఉత్తమ కార్యములను అర్థము గలదు. కావున యజ్ఞోపవీతము తనకు, యితరులకు మేలుజేయు ఉత్తమ కార్యములను గ్రహింపజేయునది యనియు అర్థమగును. ఉత్తమ కార్యములు వేదములందు విస్తృతముగా వర్ణింపబడినవి. ఆందు యమములుగా జెప్పబడు ఆహింసా సత్యాస్తేయ బ్రహ్మ చర్యాపరిగ్రహములును, నియమములుగా జెప్పబడు శౌచ సంతోష తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానములును ముఖ్యమైనవి. ఈ పదింటిలోను సత్య మతి ముఖ్యమనియు దానిని గట్టిగా పట్టుకొనిన మిగిలిన సద్గుణములన్నియు తేలికగా లభించుననియు **"న హి సత్యాత్ పరో ధర్మః"** అని ఋషులు ఉపదేశించిరి. అందుచేతనే మహర్షి దయానందుడు తాను స్థాపించిన ఆర్య సమాజమునకు నాల్గవ నియమముగా 'సత్యమును గ్రహించుటకును ఆసత్యమును త్యజించుటకును యెల్లప్పుడు సిద్ధముగా నుండపలె'నని నియమ మేర్పరచెను. ఈ యజ్ఞోపవీతము సదా సత్యమును గ్రహించుటకు ప్రేరేపించును.

**యజ్ఞోపవీతమ్ :** అట్టి దివ్య గుణములు గల యజ్ఞోపవీతము.

**బలమస్తు తేజః :** 'తేజః బల మస్తు – తేజస్వంతమైన కీర్తి నొసగు బలము నిచ్చును గాక ! బలము శారీరకము, మానసికము, ఆత్మికము అని మూడు విధములుగా నుండును, లోకములో శారీరక బలము గల ఆటగాండ్రు, వ్యాయామశీలురు, బరువు లెత్తువారు అనేకమంది గలరు. అది వారికి కొంత ఉపయోగపడునేమో కాని యితరులకేమి మేలు జేయును? ఇక దొంగలు, దోపిడిగాండ్రుకూడ బలము కలిగి యుందురు. కాని–అది వారికి, యితరులకు ఆపకారమే జేయును. గాన అది తేజస్వంతము గాదు. దానిలో భయము, దీనత్వము దాగి యుండును. కాని యజ్ఞోపవీతధారి ఉత్తమ కార్యములు జేయుచు, యజ్ఞమయ జీవితమును గడుపుచు

నిర్భయముగా, అదీనుడుగా నుండును అది తనకు, యితరులకు వెలుగును ప్రసాదించును. అందుచే యజ్ఞోపవీతము తేజస్విత బలము నొసగు సూత్రమని చెప్పబడినది.

పై విషయముల వలన యజ్ఞోపవీత వైశిష్ట్యము కొంత తెలిసి నను యిది యెవరు ధరించవలెను? ఎవరు ధరించరాదు? స్త్రీలు, శూద్రులు ధరించవచ్చునా? ఎన్ని ముడులు ధరించవలెను? ఎప్పటి నుండి యెప్పటివరకు ధరించవలెను? అను ఆనేక ప్రశ్నలు-సందేహములు కలుగుచుండును. స్థలాభావము వలన వాటిని గురించి సంక్షిప్తముగా జెప్ప యత్నింతుము.

**1. <u>ఎవరు ధరించవలెను?</u> :** ఈ యజ్ఞోపవీత ఉద్దేశ్యము తెలిససిన మానవ మాత్రులందరు ధరించవచ్చును. ఏ దేశవాసులైనా, ఏ వర్గ సంప్రదాయమునకు జెందిన వారైనా యజ్ఞమయ జీవితము గడుపగోరు వారందరు ధరించవచ్చును.

**2. <u>ఎవరు ధరించరాదు?</u> :** మద్య మాంస సేవనము చేయువారు, సదాచారహీనులు, కపట స్వార్థమయ జీవితము గడుపువారు ధరించ రాదు. అట్టి వారు ధరించిన వారు హేళనకు గురియగుటయే గాక యజ్ఞోపవీతమును కించపరచి మరింత పాపభాగులగుదురు. కాని, అట్టి వారు కూడ పశ్చాత్తాపచిత్తులై సన్మార్గమునకు రాగోరి దృఢ సంకల్పముతో వ్రతమయ జీవితము గడుపగోరిన ధరింపవచ్చును.

**3. <u>స్త్రీలు, శూద్రులు ధరించవచ్చును?</u> :** స్త్రీలు కూడ మానవ మాత్రులే కావున వారికిని మూడు ఋణము లుండును. వారును వేదాధ్యయన, సంధ్యావందన, అగ్నిహోత్రాదులు చేయవచ్చును. వారు కూడ వ్రతమయి జీవితము గడుపవచ్చును. సృష్ట్యాది నుండి మహా భారత కాలము వరకు స్త్రీలు యజ్ఞోపవీత ధారులై వైదిక కర్మలు జేసినట్లు అనేక ప్రమాణములు చూపించవచ్చును. వాల్మీకి రామాయణములో కౌసల్యాదేవి మంత్రోచ్చారణ పూర్వకముగా అగ్నిహోత్రము చేసినట్లు (వా.రా. అయోధ్య 20-15లో) స్పష్టముగా కలదు. సీతాదేవి సంధ్యావందనము చేయు ఆర్య గృహిణిగా (వా.రా.సుందరకాండ14-49లో) హనుమంతుడు స్పష్టముగా పేర్కొనుట కాననగును. గృహ్యసూత్రములలో **"ఇమమ్ మన్త్రమ్ పత్నీ పఠేత్"** ఈ మంత్రము పత్ని (స్త్రీ) చదవాలి అని అనేక సందర్భములలో వ్రాయబడినది. **"బ్రహ్మచర్యేన కన్యా యువానాం**

**విన్దతే పతిమ్"**-కన్య బ్రహ్మ చారిణియై గురుకులములో వేదశాస్త్రముల నధ్యయనము జేసి యువతియై తదుపరి సమాన గుణకర్మ స్వభావములు గల పతిని పొందునని అథర్వ వేదమునందు స్పష్టప్రమాణము గలదు. అనేక వేద మన్త్రములకు స్త్రీలు ఋషికలుగా పేర్కొనబడిరి. మైత్రేయి, గార్గి, ఉభయ భారతుల వంటి ఎందరో స్త్రీలు బ్రహ్మావాదినులుగా నున్నట్లు చరిత్ర యందు కాననగును. గాన స్త్రీలు ధరింపవచ్చును.

ఇక శూద్రుల విషయము - విద్య నేర్వలేకున్నను సదాచారము గలిగి, సేవావృత్తిని స్వీకరించు వారిని శూద్రు లందురు. అట్టి శూద్రులు యజ్ఞోపవీతము ధరింపవచ్చును. ధరించి ద్విజత్వము నందుకొన సాధన జేయవచ్చును. ఇందుకు వేదమే పరమ ప్రమాణము.

**యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః ।**

**బ్రహ్మ రాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ ॥**

(యజుర్వేదము 26-2)

పరమేశ్వరుడనైన నేను ఈ కల్యాణకరమగు వేదవాణిని జనులందరి కొరకు ఉపదేశించితిని. బ్రాహ్మణ క్షత్రియ శూద్ర వైశ్యులు, వారి స్త్రీ భృత్య స్వజన పరజనులు అందరు వేదమును చదువుచు చదివించుచు, వినుచు వినిపించుచు, ఆచరించుచు ఆచరింపజేయుచు ఉన్నతిని బొందుదురు గాక ! పరమేశ్వరుడే స్వయముగా ఈ కల్యాణ కరమగు వేదవాణిని మానవ మాత్రులందరికి - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు లెల్లరుకు ఉపదేశించినట్లు చెప్పియుండెను. గాన శూద్రులు యజ్ఞోపవీతమును ధరించి యజ్ఞమయ జీవితము గడుపుటవలన నష్ట మేమున్నది. వేదము లందును స్మృతి గ్రంథాలలోను చివరకు భవద్గీత యందును గుణకర్మలను బట్టి వర్ణము లేర్పడునని నొక్కి వక్కాణించుచుండ నేటికిని లోకమున జన్మమూలక వర్ణమునే బలవంతముగా అంటగట్టుచుండుట కడు శోచనీయము ఎంత ప్రయత్నించినను విద్య యేమాత్రమురాక కూలి పని చేసుకుని జీవితము గడుపుచు సదా చారముతో నుండువారిని మాత్రమే శూద్రులని చెప్పవలయును. చదువులేక సదాచారము కూడ లేక నుండువారిని, వ్యసనపరులను శూద్రులని గాక పంచమ జనులని వేదము చెప్పును. అట్టివారు యజ్ఞోపవీతము ధరింపరాదు.

<u>ఎన్ని ముడులు ధరించవలెను</u> : మూడు దారములను ఒకటిగ పెనవేసి ఒక దారముగా చేసి, అట్టి మూడు దారములను రెండు చివరలు కలిపి ముడివేసిన ఒక ముడి యగును. ఈ ముడినే "బ్రహ్మగ్రంథి" యందురు. లోకములో సామాన్యముగా మూడు ముడుల (3×3=9 దారములు గల) యజ్ఞోపవీతమును ధరించుచుండుట చూచుచున్నాము. దానికి ప్రమాణముగా వారు కొన్ని సూత్రములు చూపింతురు. బ్రహ్మచారి ఒక ముడి, గృహస్థుడు రెండు గాని అంతకు మించిగాని, యుత్త రీయము లేకున్న మూడవ ముడియు ధరించవలెనని స్మృత్యర్థసార సూత్రమును ప్రమాణముగా చూపింతురు. కాని "పరివృత తంతుంతన్వాన స్త్రీవృతం యథావిదే" (ఋ. 9-86-32) మూడు ప్రోగుల యజ్ఞోపవీతదారి కావలెనని వేదము స్పష్టముగా చెప్పుచున్నది. గాన మూడు దారములు గల ఒక ముడిని ధరించుటయే సరియైన పద్ధతి. స్నాతకులు గృహస్థులు రెండు ముడులు + ఉత్తరీయమునకు బదులు మరొకటి కలిపి మూడు ముడులు వేసుకొనవలె నను ఆచారము మధ్యకాలీనమని తెలియుచున్నది. నేడు లోకమున బ్రహ్మచారులు ఒక ముడిని, వివాహితులు భార్య ధరించవలసిన దానికి బదులుగా రెండవది, ఉత్తరీయ మునకు బదులుగా మరియొకటి కలిపి మూడు ముడులు వేసుకొను చున్నారు. అట్లని భార్య చనిపోయిన వారు ఒక ముడి తగ్గించుటలేదు. ఒక ఉత్తరీయము వేసుకొనువారికి మూడవ ముడి ఎందులకు? ఇది ఎంతవరకు సమంజసము. హేతుబద్ధముగా నాలోచించిన మూడు ఋణముల భారమున్నట్లు గుర్తు చేయుటకు అనువుగా మూడుప్రోగుల యజ్ఞోపవీతము ధరించుటయే సమంజసముగా నుండును.

భార్యకు కూడ - స్త్రీలకు కూడ మూడు ఋణము లుండును గాన వారు వేసుకొనవలసిన ముడిని వారికే ధరింపచేయుట మంచిది. యజ్ఞోపవీతములోని మూడు ప్రోగులు (దారములు) మూడు ఋణములను తెలుపుటయే గాక సృష్టిలోని అనేక త్రికములను సూచించును. అవి ప్రకృతి, జీవ, పరమాత్మలు; సృష్టి, స్థితి, ప్రళయములు; భూత, భవిష్యత్తు, వర్తమానములు; తల్లి, తండ్రి, ఆచార్యులు మొదలగునవి.

<u>ఎప్పటి నుండి ఎప్పటివరకు ధరించవలెను</u> : ప్రాచీన కాలమున 8-13 సంవత్సరముల మధ్య ఉపనయనము జేసి యజ్ఞోప వీతము ధరింపజేసి గురుకులములకు

విద్యాభ్యాసము కొరకు పంపెడివారు. అప్పటినుండి బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ ఆశ్రమములలో దీనిని ధరించియే యుండవలెను. వానప్రస్థాశ్రమమున తపస్సుతో పరిపక్వము జెంది, పుత్ర ధన దారేషణాదులను పోగొట్టుకున్న వ్యక్తులు సంన్యాసాశ్రమము స్వీకరించెడి వారు. తదుపరి వారికి ఈషణత్రయములు లేనందున యజ్ఞోపవీతము ధరించవలసిన అవసరములేదు. ఏలయన వారు సంసార యజ్ఞవేదికకున్న బ్రహ్మచర్య, గృహస్థ, వాన ప్రస్థాశ్రమము లను మూడు మెట్లను అధిరోహించి యజ్ఞాగ్నిలో బడి అగ్నిరూపము జెంది యజ్ఞాగ్ని వలె పరహితమునకే అంకితమగుదురు. అందుచేతనే సంన్యాసులు అగ్నిరంగు గల కాషాయ వస్త్రములు ధరింతురు.

కాని నేడు ఈ యజ్ఞోపవీతము పెండ్లినాడు మ్రొక్కుబడిగా ధరించుట విచిత్రము. ఇక మరికొందరు నేను హేతువాదినని, సోషలిస్టునని, మతమౌఢ్యం గలవాడినై పోదునేమోనని రకరకాల భావనలతో ఉన్న యజ్ఞోపవేతమును తీసివేతురు. కాని, వైదిక ధర్మము ఒక వ్యక్తి అభిప్రాయముతో ఏర్పడిన మతము వంటిది కాదు. వేదము ఈశ్వరవాణి యని అంగీకరించలేక పోయినా అది వైజ్ఞానికమైన ప్రకృతి సూత్రములపై మానవతా విలువలను కాపాడుచు మానవాభ్యుదయానికి దారిచూపు అద్భుత గ్రంథము. అట్టి వేదము చెప్పు మహోన్నత సోషలిజాన్ని, హేతువాదాన్ని ఈనాటి సోషలిస్టులు, హేతువాదులు అందుకోనేలేదని చెప్పినను అతిశయోక్తి కాదు.

## కర్తవ్యము :

ఇప్పటికైనా మీ సందేహములు తీరి యజ్ఞోపవీత వైశిష్ట్యము అవగతమై యుండును. మరి ఆలస్య మేల? యజ్ఞోపవీతము ధరింప ఉద్యుక్తులు కండు. గుడులలో, ఆశ్రమములలో పురోహితులు - మేము శూద్రులము, మాకు యజ్ఞోపవీత సంస్కారము జరిపించ నిరాకరింతురు గదా! అని సందేహించుచున్నారా? అట్లయిన మీకు ఆర్య సమాజము స్వాగతము పలుకుచున్నది. ప్రతి ఆర్య సమాజ శాఖ, ప్రతి ఆర్య సమాజ పురోహితుడు మీకు యజ్ఞోపవీత సంస్కారము చేయ సిద్ధముగా నుండును. వారు స్త్రీలచే కూడ ధరింపజేయుదురు.

వైదిక సంస్కృతికే పతాకము వంటి యజ్ఞోపవీతమును జాతీయ పతాకము వలె మనము గౌరవింతము రండు. దాని రక్షణకై ఎన్ని త్యాగములు చేయుటకైనా సంసిద్ధుల మగుదుము రండు.

# బ్రహ్మచర్య విశిష్టత

## 'బ్రహ్మచర్యం' అవసరమా?

ఈ ప్రశ్నకు జవాబు తెలుసుకునేముందు 'బ్రహ్మచర్యం' అనే పదమునకు అర్థమేమిటో తెలుసుకోవటం అవసరం. 'బ్రహ్మ' అంటే పెద్దది, గొప్పది అని అర్థం. అట్టిదానిలో చరించటాన్ని - ఆ స్మృతిలో జీవితం గడపటాన్ని బ్రహ్మచర్యమంటారు. 'బ్రహ్మ' అనే పదమునకు సంస్కృత నిఘంటువులో చాలా అర్థాలు కనబడతాయి. వాటిలో ముఖ్యమైనవి నాలుగు. అవి - 1. పరమేశ్వరుడు (సృష్టికర్త) (అతడే అన్నిటికన్న పెద్దవాడు, గొప్పవాడు కదా!) 2. ఆయనచే సృష్ట్యాదిలో ఉపదేశింపబడిన నాలుగు వేదాలు. (అవే మానవజాతికి జ్ఞాన స్రోతస్సులు). 3. జీవితంలోని మొదటి భాగమున బ్రహ్మచర్యాశ్రమం (విద్యార్థిదశ) 5 నుండి 25 సంవత్సరాలవరకు. 4. మైథునత్యాగం (స్త్రీ సంపర్కం చేయకుండా నిగ్రహంతో ఉండటం - ఆలోచనే రాకుండా ఉండటం.) స్త్రీలుకూడా అట్లే ఉండాలి. బ్రహ్మచర్యమనే పదము స్త్రీ పురుష లిరువురికి వర్తిస్తుంది.

పై నాల్గింటిలో 3,4 అర్థాలను కొంత వివరంగా తెలుసుకుందాము. మన ప్రాచీన ఋషులు మానవజీవన కాలాన్ని నాలుగు భాగాలుగా చేసి, వాటికి బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సంన్యాసాశ్రమాలనీ పేర్లుపెట్టారు. ఇక్కడ ఆశ్రమం అంటే - (ఆ - సమంతాత్ శ్రమయతి యస్మిన్) చక్కగా ఒక లక్ష్యం కొరకు శ్రమించటం - గట్టిప్రయత్నం చెయ్యటం అని అర్థం. వీటిలో మొదటిదైన బ్రహ్మచర్యాశ్రమంలో (విద్యార్థిదశలో పూర్తిగా మైథున త్యాగం చెయ్యాలి. అందుకు బలమైన రెండు కారణాలు చెబుతారు. ఆ వయస్సులో శరీరం ఎదిగి బలపడుతుంది. కనుక అప్పుడు వీర్యనష్టం చేసుకుంటే శారీరక ఎదుగుదల, బలపడటం సరిగా జరుగదు. అందుచే జీవితాంతం తేలికగా వ్యాధులకు గురికావటం, బరువైన పనులు చేయలేకపోవటం జరుగుతుంది. తద్వారా మరెన్నో సమస్యలకు గురియౌతారు. ఆత్మన్యూనతా భావాలు కలుగుతూ ఉంటాయి. విద్యార్థుల ఆత్మహత్యలకు ఇది కూడా ఒక కారణమంటున్నారు మానసిక వైద్యులు, తత్త్వవేత్తలు. రెండవకారణం - ఆ వయస్సులో శృంగార ఆలోచనలు చేస్తే చదువుపై శ్రద్ధ, ఏకాగ్రత తగ్గిపోతుంది. అందుచే అతడు బౌద్ధికంగా

వెనుకబడిపోతాడు. జీవితంలో ఎదుగ గలిగినంత ఎదుగ లేకపోతాడు. ఈ విషయంపై మన ప్రాచీన ఋషులు చాలా పరిశోధనలు చేసి చెప్పిన మాట లేమంటే–

**"శ్లో॥ ఆహారస్య పరంధామ శుక్రం తద్రక్ష్య మాత్మనః।**

**క్షయోహ్యస్య బహూన్ రోగాన్ మరణం వా నియచ్ఛతి ॥**

<u>**తాత్పర్యం :**</u> శుక్రమంటే వీర్యం. అది ఆహారం యొక్క పరమధామం – సారభూతం. మనలను మనం రక్షించుకోవటానికి ఆరోగ్యంగా, బలంగా ఉండటానికి వీర్యాన్ని మన శరీరంలో భద్రపరచుకుంటూ ఉండాలి. వీర్య దుర్వినియోగం వల్ల అనేక రోగాలు కలుగుతాయి. దాని విపరీత నాశనం వల్ల మరణంకూడా సంభవిస్తుంది." అంటాడు సుశ్రుతా చార్యుడు తమ సుశ్రుత సంహితలో.

**"శ్లో॥ అగ్నిమూలం బలం పుంసాం, రేతోమూలం తు జీవితం ।**

**తస్మాత్ సర్వప్రయత్నేన, అగ్ని వీర్యం చ రక్షయేత్ ॥**

<u>**తాత్పర్యం :**</u> జఠరాగ్ని (జీర్ణశక్తి) మానవుల బలానికి కారణమౌతుంది. రేతస్సు (అంటే – వీర్యం) ఆరోగ్యంగా ఇంద్రియపటుత్వంతో, బ్రహ్మవర్చస్సుతో దీర్ఘకాలం జీవించటానికి మూలమౌతుంది. అందుచే అన్నివిధాలుగా ప్రయత్నించి శరీరంలో జఠరాగ్నిని, వీర్యాన్ని రక్షించుకుంటూ ఉండాలి అంటాడు అగ్నివేశ మహర్షి తమ చరకశాస్త్రంలో. ఈ విధంగానే అన్ని ఆయుర్వేద గ్రంథాలు బ్రహ్మచర్యాన్ని నొక్కి వక్కాణించాయి.

<u>"త్రయ ఉపస్తంభన మాహ ఇతి + ఆహారః స్వప్నో బ్రహ్మచర్యమితి"</u> (చరకం) – ఆరోగ్య రక్షణకు మూల స్తంభాలు మూడు. శుద్ధమైన, సమతుల్యమైన, తన శరీరతత్త్వానికి అనుకూలమైన, సాత్త్వికాహారం మితంగా హితంగా న్యాయార్జితమైనది సేవించటం మొదటి మూలస్తంభం. <u>రెండవది</u> స్వప్నః (నిద్ర) – సరిపడినంతగా కనీసం 6 గంటలు నిద్రించాలి. రాత్రి 9 గంటలకే నిద్రించి తెల్లవారు ఝామున 3–4 గంటలమధ్య నిద్రలేవటం ఉత్తమం. <u>మూడవ స్తంభం</u> బ్రహ్మచర్యం – వీలైనంత ఎక్కువగా వీర్యాన్ని రక్షించుకోవటం. కనీసం మూడు కాళ్ళైనా ఉంటేకాని ఆ పీటపై మనం క్షేమంగా కూర్చోలేముకదా! అందుచే నిద్రాహారాలు ఎంత ముఖ్యమో బ్రహ్మచర్యం కూడా అంతే ముఖ్యం. ఇది విద్యార్థులకు చాలా చాలా అవసరం, ముఖ్యం.

కాని, నేటి యువతీ యువకులు ఫ్యాషన్ల మోజులో, ప్రకటనల మోజులో, సినీమాల మోజులో పడి కామాంధులైపోతున్నారు. దీనికితోడు నేటి యువతీయువకుల కాలేజీలు ఒకటే కావటం (Co-Education) మరింత ప్రేరేపిస్తున్నది. వస్త్రధారణలు మరొక కారణంగా ఉన్నాయి. ఇవన్నీ కలిసి నేడు బ్రహ్మచర్యం నవ్వుల పాలయ్యింది. నేటి అల్లోపతీ వైద్యులకు బ్రహ్మచర్య విలువలు అసలు తెలియనే తెలియక పోవటం దురదృష్టకరం. కొందరైతే – " ఆకలిదాహాల వంటిదే కామంకూడా కనుక కామేచ్ఛ కలిగినపుడు దానిని తీర్చుకోవటమే మంచి" దంటున్నారు. అది కృత్రిమ పద్ధతిలోనైనా (హస్తమైథునం Masterbation ద్వారా నైనా) సరే తీర్చుకోవటం మంచిదనే మహాను భావులు కూడా కొందరున్నారు. దానితో కొందరు యువతీ యువకులు హస్తమైథునానికి అలవాటుపడిపోతున్నారు. అది కొందరికి వ్యసనంగా మారిపోయి నిర్వీర్యులుగా, నిస్తేజులుగా, నిర్బలులుగా మారిపోతున్నారు. కొందరు అక్రమ సంబంధాలు ఏర్పరచుకొని వ్యభిచారులై పోతున్నారు. స్త్రీహింస, మానభంగాలు, హత్యలు పెరిగిపోతున్నాయి. ఇప్పటికైనా మేధావివర్గం మేల్కొని ఈ దుస్థితినుండి యువతను రక్షించవలసిందిగా మేము ప్రార్థిస్తున్నాము.

భారతీయ వైద్య విధానాలేవీ వీర్యనష్టాన్ని సమర్థించవు. కాగా వీర్యధారణచేసి ఓజస్వంతులు కమ్మని ప్రోత్సహిస్తాయి. హోమియో వైద్యం జర్మనీ దేశంలో కనిపెట్టబడినా అది పూర్తిగా ఆయుర్వేద స్వస్థవృత్తాన్నే (దినచర్యనే) అనుసరిస్తుంది. రోగకారణాలను రికార్డు చేసుకునేటప్పుడు (Care Taking చేసేటప్పుడు) వీర్యనష్టం చేసుకున్నారా? అని అడుగుతారు. మనస్సులో సెక్సుభావనలు బలంగా ఉన్నాయా? అని ప్రశ్నించి రికార్డు చేసుకుంటారు. అవే ఆ వ్యాధిలో మూలకారణమైతే దానినిబట్టి మందు ఎన్నుకొని అద్భుతమైన ఫలితాలను సాధిస్తారు. హస్తమైథున దురభ్యాసం ఉంటే ఆ భావాలు మనసులో కలుగకుండా కూడా హోమియోపతిలో మందులుంటాయి. మీ సమీపంలో ఉన్న వైద్యులను సంప్రదించండి. ఇంతటి విశిష్టతలున్నాయి కనుకనే భారత ప్రభుత్వం హోమియోవైద్యాన్ని AYUSH (ఆయుర్వేద, యోగ, యునాని, సిద్ధ, మోమియోపతి) లో కలిపి ఆదరిస్తున్నది, ప్రోత్సహిస్తున్నది.

అట్లే, భారతీయ మత సంప్రదాయేలేవీ వీర్యనష్టాన్ని సమర్థించవు. ఇంద్రియనిగ్రహాన్ని, బ్రహ్మచర్యాన్ని పాటించి సర్వదుఃఖ నివృత్తిరూప ముక్తిని

సాధించమనే ప్రోత్సహిస్తాయి. విదేశీమతాలే వక్రమార్గాలను ప్రోత్సహిస్తున్నాయి. 'Eat, Drink and be Merry' అంటూ ప్రేరేపిస్తున్నాయి. ఆ మతాలు పూర్వజన్మలను, పునర్జన్మలనుకూడా అంగీకరించవు. అయితే మానవులలో సుఖ దుఃఖాల వ్యత్యాస మెందుకు? అట్లయితే, దేవుడు పక్షపాతి కాడా? ఇక మనం వీర్యోత్పత్తిని గురించి, దాని విలువలను గురించి తెలుసుకుందాము.

**<u>వీర్యోత్పత్తి - దాని విలువ</u>**

ఋగ్వేదానికి ఉపవేదమైన ఆయుర్వేదం వీర్యోత్పత్తని గురించి ఈ క్రిందివిధంగా చెబుతుంది

**శ్లో|| రసాద్రక్తం తతోమాంసం మాంసాన్మేదః ప్రజాయతే ।**

**మేదస్యాస్థిః తతో మజ్జా, మజ్జాయాః శుక్ర సంభవః ||** - సుశ్రుతం

**<u>తాత్పర్యం :</u>** జీర్ణమైన ఆహారం ముందుగా రసంగా (Lymph గా) మారి రక్తంలోకలుస్తుంది. ఆ రక్తంనుండి క్రమంగా మాంసము, మేద (క్రొవ్వు), అస్థి (ఎముక - Bone tissue), మజ్జా (Bone Marrow) శుక్రకణములు (స్త్రీలలో రేతస్సు - అండకణములు) తయారౌతాయి. ఇవి ఉత్తరోత్తర శ్రేష్ఠమైనవి. సారభూతమైనవి. అంటే విలువైనవని గ్రహించాలి.

ఇట్టి విలువైన వీర్యాన్ని ఎంత ఎక్కువగా రక్షించుకుంటే అంతగా శారీరకబలం, బౌద్ధికబలం పెరుగుతాయి. యోగసాధన చేసి ఆ వీర్యాన్ని ఓజస్సుగా మార్చుకుంటే శరీరానికి బ్రహ్మవర్చస్సు కలుగుతుంది. బుద్ధివికసించి మేధస్సుగా, ప్రజ్ఞగా, ప్రతిభగా మారుతూ చివరకు ఋతంభరా ప్రజ్ఞగా స్థిరపడుతుంది. సృష్టిరహస్యాలన్నీ కరతలామలకం అవుతాయి. ఏ పదార్థాన్ని గురించి తెలుసుకోవాలనుకుంటే ఆ పదార్థాన్ని గురించి సంపూర్ణ జ్ఞానం స్పష్టంగా అవగతమౌతుంది. ఆ 'ఋతంభరా' ప్రజ్ఞతోనే ఆత్మపరమాత్మల సాక్షాత్కారం అవుతుంది. జన్మ ధన్యమౌతుంది.

అట్టి విలువైన వీర్యాన్ని వ్యర్థం చేసుకోవటం బుద్ధిమంతుల లక్షణంకాదు. మహర్షులు, మహాత్ములు ఏమన్నారంటే - "సంతానార్థం మాత్రమే వీర్యాన్ని ఖర్చుపెట్టడం ఉత్తమోత్తమం లేదా ఋతుగామియైతే మధ్యమం. (ఋతుగామి అంటే - స్త్రీలకు ఋతుస్రావానంతరం 10,15 రోజుల అండం విడుదలయ్యే సమయంలో

తీవ్రకామేచ్ఛ కలుగుతుంది. ఆ సమయాన్ని ఋతుకాలం అంటారు. అప్పుడు), మిగిలిన సమయాలన్నీ నీచం. స్పర్శేంద్రియానికి దాసులం అయినట్లు అవుతుంది. విలువైన వీర్యాన్ని మురుగుకాల్వలో ప్రవహింప చేసుకోవటం" అన్నారు మహర్షులు. ఈ చివరిమాటలు మనకు కఠినంగా అనిపించినా ఇవి సత్యం.

## "గృహస్థ బ్రహ్మ చర్యం" అంటే ఏమిటి?

ముందు తెలిసి కొన్నట్లుగా బ్రహ్మ చర్యాశ్రమం తదుపరిది గృహస్థా శ్రమం. అంతవరకు యువతీ యువకులు వేరువేరు గురుకులాలలో కఠినమైన నియమాలు పాటిస్తూ వచ్చారు కనుక వారికి సమావర్తన (స్నాతక) సంస్కారం జరిపి గురువులు వారిని యింటికి పంపిస్తారు. అప్పటివరకువున్న నియమాలను సడలిస్తారు. అప్పుడు చాలా ఉపదేశాలు చేస్తారు. వాటిలో "ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః-ప్రజాతంతువును విచ్ఛిన్నం చెయ్యవద్దు" అనేది ఒక ఉపదేశం. అంటే సంతానాన్ని కని, పెంచి పెద్దచేసి, విద్యాబుద్ధులు చెప్పి వారి కాళ్ళపై వారు నిలబడేటట్లు చెయ్యటం. తమ తల్లిదండ్రులు తమను ఏ విధంగా తీర్చిదిద్దారో అట్లే వారి సంతానాన్ని వారు తీర్చిదిద్దాలి. అందుకు పురుషునికి స్త్రీ, స్త్రీకి పురుషుడు అవసరం-అనివార్యం. ఇంతేగాక, ఎంతకాలం తల్లిదండ్రులు వారికి తోడుగా ఉంటారు? జీవితాంతం తోడుగా నిలబడే జీవనసఖులు అవసరమే కదా! అందుకు పెద్దల, బంధుమిత్రుల సమక్షంలో తమ గుణ కర్మస్వభావాలకు తగిన యువతిని ఎంచుకొని వివాహం చేసుకోవటమే సరియైన పరిష్కారం. వివాహ సంస్కారంలో గృహస్థాశ్రమ నియమాలు చాలానే ఉపదేశింపబడ్డాయి. ఆ వివరాలు మహర్షి దయానందులవారి సంకలన రచన "సంస్కార విధి"లోని గృహస్థాశ్రమ ప్రకరణాన్ని చదివి తెలుసుకోండి. ఇక మనం గృహస్థబహ్మాచర్యాన్ని గురించి తెలుసుకుందాము-

"**శ్లో॥ ఋతుకాలాభిగామీ, స్యాత్స్వదార నిరతః సదా ।**

**బ్రహ్మ చార్యేవ భవతి యత్ర తత్రాశ్రమే వసన్ ॥** మనుస్మృతి (3-48, 50)

తా॥ నిషిద్ధ రాత్రులను వదిలి తన భార్యతోనే ఋతుకాలంలో మాత్రమే మైథునక్రియ జరుపువాడు గృహస్థాశ్రమంలో ఉన్నప్పటికీ బ్రహ్మచారికి సమానుడు"

అని మన ధర్మ శాస్త్రాలు చెబుతాయి.

ఋతుకాలమంటే-స్త్రీ బహిష్టు అయిన దినం నుండి 16 దినములవరికి ఉన్న కాలాన్ని ఋతుకాలం అంటారు. అయితే మొదటి 4 దినాలు స్త్రీలకు ఋతుస్రావం జరుగుతూ బలహీనంగా ఉంటారు కనుక అవి నిషిద్ధ దినాలు. అంటే-ఆ సమయంలో భార్యాభర్తలు కలియకూడదు. మిగిలిన 12 దినాలలోనూ పౌర్ణమి. అమావాస్యా, అష్టమి, చతుర్దశి పర్వదినాలు. కనుక ఆ దినములో కలియ కూడదంటారు ఋషులు. ఆ రోజులలో విశేష హోమాలు చేసి, వేదస్వాధ్యాయంలో గడపాలంటారు. కనుక ఆ దినములు కూడా నిషిద్ధములే.

**శ్లో॥ అమావాస్యాష్టమీం చ పౌర్ణమాసీ చదుర్దశీమ్ ।**
**బ్రహ్మచారీ భవేన్నిత్యమప్యృతౌ స్నాతకోద్విజః ॥** మనుస్మృతి (4-128)

తా॥ ఋతుకాలమైనప్పటికీ గృహస్థుడు అమావాస్యా, అష్టమి, పౌర్ణమి, చతుర్దశి దినాలలో భార్యతో శారీరక సంబంధం పెట్టుకోకుండా బ్రహ్మ చారిగా ఉండాలంటుంది మనుస్మృతి.

సంతానం కలగాలి అనుకునే దంపతులు స్త్రీ శరీరంలో అండం విడుదలయ్యే సమయంలో కలవాలంటారు వైద్యులు. ఆ సమయం తెలుసుకోవటానికి కొన్ని సూత్రాలు చెబుతారు స్త్రీ వైద్యనిపుణులు (గైనకాలజి స్పెషలిస్టులు). వాటి వివరాలకు మా ప్రచురణ "గర్భాధాన విజ్ఞానము" చదువగోరు చున్నాము.

ఆవులు అండం విడుదలయ్యే సమయంలో ఏదో చిన్నబాధ ఉన్నట్లు అరుస్తూ ఉంటాయి. అది గుర్తించి ఆవు ఎదుకువచ్చిందని గుర్తిస్తారు. వీలైనంత తొందరగా ఆంబోతు దగ్గరకు తీసుకు వెళ్ళటంకాని, కృత్రిమ పద్ధతిలో ఆబోతు వీర్యన్ని యోనిద్వారా ఆవు గర్భాశయంలోనికి ఎక్కించటం కాని చేస్తారు. అల్లే, కుక్కలు మొదలైన పశువులు ఋతుకాలంలోనే మైథునం చెయ్యటానికి యిష్టపడతాయి. వేరే సమయాలలో ఆడమొగ కుక్కలు కలిసి తిరుగుతున్నా సమాగమం చెయ్యవు. చెయ్యనివ్వవు. కాని, నాగరికతగల మానవులు ప్రకృతికి దూరమై అసహజ జీవితం గుడువుతున్నారు. పెక్కురోగాలకు గురియౌతున్నారు. ఆయుర్వేద చరక శాస్త్రం ఏమంటుందంటే-

**శ్లో॥ వ్యాయామ హాస్యభాషాధ్వ గ్రామ్య ధర్మ ప్రజాగరాన్ ।**
**న.ఉచితానపి సేవేత బుద్ధిమానాతిమాత్రయా ॥**

తా॥ అతిగా వ్యాయామం చేయటం లేదా ఎక్కువ అలసట కలిగే పనులు చెయ్యటం, ఎప్పుడూ హాస్య భాషణ చెయ్యటం, అతి సంభోగం, రాత్రులు మేల్కొని ఉండటం. ఈ నాలుగు అంత మంచివికావు. బుద్ధిమంతులు వీటిని మితంగా వాడుకోవాలి. లేకుంటే శరీరంలో ధాతుశక్తి తగ్గిపోయి తేలికగా వ్యాధులు సంక్రమిస్తాయి. ఆయువు క్షీణిస్తుంది" అంటుంది.

మనం అల్పాయువును జయించి దీర్ఘకాలం ఆరోగ్యంగా జీవించాలంటే బ్రహ్మచర్యం, తపస్సు ముఖ్యమంటుంది అథర్వ వేదం లోని బ్రహ్మచర్య సూక్తం. అందులోని కొన్ని విషయాలను తెలుసుకుందాము ।

**ఓం బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుముపాఘ్నత ।**
**ఇంద్రోహ బ్రహ్మ చర్యేణ దేవేభ్యః స్వరాభరత్ ॥** (అథర్వ - 11-5-19)

బ్రహ్మ చర్యము మరియు తపస్సులతో దేవతలు-బుద్ధిమంతులు, సదాచారపరులు మృత్యువును వెనుకకు నెట్టివేస్తూ దీర్ఘకాలం జీవిస్తారు. ఇంద్రుడు (జీవాత్మ) బ్రహ్మచర్యంతో ఇంద్రియాలను నిగ్రహిస్తూ ఎన్నెన్నో సుఖాలను పొందుతాడు.

**ఓం బ్రహ్మచర్యేణ తపసా రాజా రాష్ట్రం విరక్షతి ।**
**ఆచార్యో బ్రహ్మచర్యేణ బ్రహ్మ చారిణ మిచ్ఛతే ॥** (అ. 11-5-17)

దేశాన్ని పాలించే రాజులు బ్రహ్మ చర్య తపస్సులతో ప్రజలను చక్కగా పాలించగలుగుతారు, పోషించగలుగుతారు. (నేడు రాజులు లేరు కనుక మంత్రులు, నాయకులు అని అన్వయించుకోవాలి).

ఆచార్యులు, ఉపాధ్యాయులు బ్రహ్మచర్యంతోనే శిష్యుల అభిమానాన్ని పొందగలుగుతారు.

**ఓం బ్రహ్మచర్యేణ కన్యా యువానం విన్దతే పతిమ్ ।**
**అనడ్వాన్ బ్రహ్మ చర్యేణ + అశ్వో ఘాసం జిగీర్షతి ॥** అ. (11-5-18)

కన్యలు కూడా కన్యాగురుకులాలో చేరి బ్రహ్మ చర్యవ్రతాన్ని పాటించి శరీరాన్ని,

బుద్ధిని బలపరచుకోవాలి. అట్టివారే తమకు తగిన పతులను పొంది సుఖిస్తారు. ఎద్దులు, అశ్వములు కూడా బ్రహ్మ చర్యాన్ని పాటిస్తేనే గడ్డితినికూడా బలసామర్థ్యాలను పొందుతాయి.

**ఓం బ్రహ్మచారీ బ్రహ్మ భ్రాజద్భిభర్తి తస్మిన్ దేవా అధి సమోతాః ।**
**ప్రాణాపాన్ జనయన్నాద్ వ్యానం వాచంమనో హృదయం బ్రహ్మమేధామ్॥**

అ.(11-5-24)

కన్యలు కూడా కన్యాగురుకులాలో చేరి బ్రహ్మ చర్యవ్రతాన్ని పాటించి శరీరాన్ని, బుద్ధిని బలపరచుకోవాలి. అట్టి వారే తమకు తగిన పతులను పొంది సుఖిస్తారు. ఎద్దులు, అశ్వములు కూడా బ్రహ్మ చర్యాన్ని పాటిస్తేనే గడ్డితినికూడా బలసామర్థ్యాలను పొందుతాయి.

**ఓం బ్రహ్మచారీ బ్రహ్మ భ్రాజద్భిభర్తి తస్మిన్ దేవా అధి విశ్వే సమోతాః ।**
**ప్రాణాపాన్ జనయన్నాద్ వ్యానం వాచంమనో హృదయం బ్రహ్మమేధామ్॥**

అ.(11-5-24).

బ్రహ్మ చర్యాన్ని పాటించిన వారే వేద జ్ఞానాన్ని, పరమాత్మను పొందగలుగుతారు. శరీరంలోని ప్రాణాపాన వ్యాన వాయువులను బలపరచుకొంటారు.

మంచి వాక్కును, మనస్సును, హృదయాన్ని పొందగలుగుతారు. వారి మేధస్సు వికసించి అనేక విద్యా విజ్ఞానాలలో పరిపూర్ణులౌతారు.

ఈ విధంగా అథర్వవేదంలోని 26 మంత్రాలు గల బ్రహ్మ చర్యసూక్తం బ్రహ్మ చర్యంవల్ల కలిగే లాభాలను వేనోళ్ళకీర్తిస్తుంది. మన ప్రాచీన ఋషులు మనులు, విజ్ఞానవేత్తలు, రాజులు, వీరులు, బ్రహ్మ, చర్యాన్ని పాటించియే మహోత్కార్యాలు చేయగలిగారు. ప్రపంచ గురువులై విలసిల్లారు. మనమంతా వారి వారసులమే. మనంకూడా నవనాగరికత మోజులోపడి కొట్టుకుపోకుండా పూర్వుల మార్గాన్ని అనుసరించటయే ఉత్తమం. సృష్టికర్త మనకు ఉత్తమోత్తమ మానవ శరీరాన్ని నిర్మించియిచ్చాడు. కేవలం విషయభోగా లనుభవించటానికి కాదు. ధర్మాత్ములమై పరోపకారంచేస్తూ పుణ్యం మూట గట్టుకోవడానికి. దర్మమార్గంలోనే అర్థకామాలను పొందయత్నించాలి. సర్వదుఃఖ నివృత్తిరూప మోక్షాన్ని పొంద సాధన చెయ్యాలి.

మన నీతిశాస్త్రాలు ఏమంటాయంటే-

**శ్లో॥ ఆహార నిద్రా భయమైథునాని సమాని చైతాని నృణాం పశూనామ్ ।**
**ధర్మం నరాణా మధికో విశేషో ధర్మేన హీనాః పశుభిః సమానాః ॥**

తా॥ "ఆహారమ తీసికొనుట, నిద్రపోవుట, భయపడుట, మైథునంతో సంతానంకనుట" అనే నాలుగు క్రియలు మానవులకు పశువులకు సమానమే, కాని, మానవులు తమ జ్ఞానంతో ధర్మాత్ములై ఉన్నతోన్నత శిఖారాలకు చేరుకోగలరు. ధర్మంలేని మానవులు పశువులతో సమానులు అంటాయి నీతి శాస్త్రాలు. కనుక మానవ జీవిత లక్ష్యం ధర్మార్థకామమోక్ష సాధన కావాలి. అందుకొరకే గృహస్థులు కావాలంటారు ఋషులు.

గృహస్థులు తమ బాధ్యతలను పూర్తి చేస్తూ పంచ మహా యజ్ఞాలను చెయ్యాలి. పతంజలి మహర్షి ఉపదేశించిన యమనియమ ఆసన ప్రాణాయామాలను అభ్యసిస్తు మంచి ఆరోగ్యాన్ని, దీర్ఘాయువును పొంద యత్నించాలి. మైథునాన్ని మితంగా వాడుకుంటూ ఓజస్సును పెంచుకోవాలి. ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధు లభ్యసిస్తూ ఆత్మ పరమాత్మల సాక్షాత్కారాన్ని పొంద సాధన చెయ్యాలి.

గృహస్థ బ్రహ్మ చర్యాన్ని గురించి గాంధీ మహాత్ముడు ఏమన్నారంటే-

"Sex urge is a fine and noble thing. There is nothing to be ashamed of it. But it is meant only for the act of creation. Any other use of it is a sin against God and humanity" - M.K. Gandhi.

"కామవాంఛ మంచిది, గొప్పది. దానికి సిగ్గుపడ నవసరంలేదు. కాని, అది సంతానా నార్థమేకావాలి. లేకుంటే - అది దేవునికి, మానవత్వానికి వ్యతిరేక మౌతుంది" అన్నారు.

ఇట్టి మహాత్ముల, మహర్షుల, మేధావుల మాటలు కోకొల్లలుగా ఉన్నాయి. కనుక, మనమంతా వారి మార్గాన్నే పయనిద్దాము.

**"ధియో యో నః ప్రచోదయాత్॥"**

ఓ అంతర్యామీ! మమ్మ బ్రహ్మ చర్యాది సద్వ్రతముల నాచరించ ప్రేరేపింపుము. నీ తృతీయ ధామంవైపు - ముక్తి ధామమువైపు - ఆనంద ధామమువైపు నడిపింపుము.

# బ్రహ్మచర్య సూక్తం

ఋషిః - బ్రహ్మా ॥ దేవతా - బ్రహ్మ చారీ ॥

# ब्रह्मचर्य सूक्त

## ऋषिः-ब्रह्मा ॥ देवता-ब्रह्मचारी ॥

Seer-Brahman. Subject matter - Brahmanchari, one who observes continence.

ఓం బ్రహ్మచారీష్ణంశ్చరతి రోదసీ ఉభే తస్మిన్దేవాః సంమనసో భవన్తి ।
స దాధార పృథివీం దివం చ స ఆచార్యం తపసా పిపర్తి ॥ 1

**ब्रह्मचारीष्णंश्चरति रोदसी उभे तस्मिन् देवाः संमनसो भवन्ति ।**
**स दाधार पृथिवीं दिवं च स आचार्य १ तपसा पिपर्ति ॥१॥**

The Vedic student observing the vow of perfect chastity goes about exploring the earth and the heavens. All beneficent objects and forces of nature unite in ministering to him. He makes the earth and heaven (by his explorations) more and more useful to humanity. With the power of his austere and disciplined life he fulfils the aspirations of his preceptor.

ఓం బ్రహ్మచారిణం పితరో దేవజనాః పృథగ్దేవా అనుసంయన్తి సర్వే ।
గన్ధర్వా ఏనమన్వాయన్త్రయస్త్రింశత్త్రిశతాః షట్ సహస్రాః ।
సర్వాన్త్స దేవాంస్తపసా పిపర్తి ॥ 2

**ब्रह्मचारिणं पितरो देवजनाः पृथग् देवा अनुसंयन्ति सर्वे ।**
**गन्धर्वा एनमन्वायन् त्रयस्त्रिंशत् त्रिशताः**
**षट्सहस्त्राः सर्वान्त्स देवांस्तपसा पिपर्ति ॥२॥**

Protectors of human society, men wishing for success in life, and those well-versed in the affairs of the world have always in different ways to follow the man of subdued passions given to the pursuit of Vedic learning. May, the diligent six thousand three hundred and

thirty three supporters also allow themselves to be led by him, for, he fulfils, by his mortified and regulated life, (the wishes of) all those aspire after success.

ఓం ఆచార్య ఉపనయమానో బ్రహ్మచారిణం కృణుతే గర్భమన్త ః ।

తం రాత్రీంస్తిస్ర ఉదరే బిభర్తి తం జాతం ద్రష్టుమభిసంయన్తి దేవాః॥ 3

**आचार्य उपनयमानो ब्रह्मचारिणं कृणुते गर्भमन्तः ।**

**तं रात्रीस्तिस्त्र उदरे बिभर्ति तं जातं द्रष्टुमभिसंयन्ति देवाः ॥३॥**

The preceptor admits him to his college and keeps him in his shelter and watchful attention for three days and three nights. When his course of study is completed the learned eagerly assemble to see him.

ఓం ఇయం సమిత్పృథివీ ద్యౌర్ద్వితీయోతాన్తరిక్షం సమిధా పృణాతి ।

బ్రహ్మచారీ సమిధా మేఖలయా శ్రమేణ లోకాంస్తపసా పిపర్తి ॥ 4

**इयं समित् पृथिवी द्यौर्द्वितीयोतान्तरिक्षं समिधा पृणाति ।**

**ब्रह्मचारी समिधा मेखलया श्रमेण लोकांस्तपसा पिपर्ति ॥ ॥४॥**

This first stick stands for earth, the second for heaven and he fills the firmanent with third. The Vedic student with this fuel for the *Havana*, with his girdle, his hard work and his austerity renders all the worlds perfect.

*N.B.* :- These sticks give the idea that through them the Brahmachari attain the knowledge of these three regions which include all the spheres of knowledge.

ఓం పూర్వో జాతో బ్రహ్మణో బ్రహ్మచారీ ఘర్మం వసానస్తపసోదతిష్ఠత్ ।

తస్మాజ్జాతం బ్రాహ్మణం బ్రహ్మ జ్యేష్ఠం దేవాశ్చ సర్వే అమృతేన సాకమ్॥ 5

**पूर्वो जातो ब्रह्मणो ब्रह्मचारी घर्मं वसानस्तपसोदतिष्ठत् ।**

**तस्माज्जातं ब्राह्मणं ब्रह्म ज्येष्ठं देवाश्च सर्वे अमृतेन साकम् ॥ ॥५॥**

The Vedic student by his studies, becomes renowned in good time and putting off lustre attain high esteem among men, From him springs the most excellent celestial lore of interpreting the Veda, the Eternal revealed law, and ever increasing wealth. All the wise also attain eternal bliss through his help.

ఓం బ్రహ్మచార్యే తి సమిధా సమిద్ధ ః కార్ష్ణం వసానో దీక్షితో దీర్ఘశ్మశ్రుః ।
స సద్య ఏతి పూర్వస్మాదుత్తరం సముద్రం లోకాన్త్సంగృభ్య ముహురాచరిక్రత్ ॥ 6

**ब्रह्मचार्येति समिधा समिद्धः कार्ष्णं वसानो दीक्षितो दीर्घश्मश्रुः ।**
**स सद्य एति पूर्वस्मादुत्तरं समुद्रं लोकान्त्संगृभ्य मुहुराचरिक्रत् ॥ ॥६॥**

Shining with the brilliancy of true learning (though) elad in dark-coloured (and coarse) garments, having taken the vows of an initiate (a full fledged graduate) with a flowing beard and moustaches, the student of the eternal Vedic lore, now lanches at once upon his life's voyage on the vast and deep sea of the house-holding stage, having before, successfully come out of the equally unfathomable student stage. By his virtuous life he brings together all the worlds in his own person, and always challanges the attention of all (both by his sane advice and exemplary life).

ఓం బ్రహ్మచారీ జనయన్‌బ్రహ్మాపో లోకం ప్రజాపతిం పరమేష్ఠినం విరాజమ్।
గర్భో భూత్వామృతస్య యోనావిన్ద్రో హ భూత్వాసురాంస్తతర్హ ॥ 7

**ब्रह्मचारी जनयन् ब्रह्मापो लोकं प्रजापतिं परमेष्ठिनं विराजम् ।**
**गर्भो भूत्वामृतस्य योनाविन्द्रो ह भूत्वासुरांस्ततर्ह ॥ ॥७॥**

Revealing by his life and teaching the principles of Vedic lore the science of the vital airs, the sciences, regarding the world of creatures, the science which treats of the nature of God, the Revealer of all the worlds and the Lord of all creatures in his Highest Beautific state, the Vedic Student, lying hidden and growing day by day as a foetus in knowledge of God, the source of salvation, becomes most brilliant like the Sun and suppresses all that are

heretically inclined.

ఓం ఆచార్య స్తతక్ష నభసీ ఉభే ఇమే ఉర్వీ గమ్భీరే పృథివీం దివం చ ।
తే రక్షతి తపసా బ్రహ్మచారీ తస్మిన్దేవాః సంమనసో భవన్తి ॥ 8

आचार्य स्ततक्ष नभसी उभे इमे गम्भीरे पृथिवीं दिवं च
ते रक्षति तपसा ब्रह्मचारी तस्मिन् देवाः संमनसो भवन्ति ॥ ॥८॥

The master renders more useful both these vast and profound regions which are united with each other namely, the earth and the heavens. The Vedic student by his austerities protects them and all beneficient forces of nature cooperate in him (towards his good).

ఓం ఇమాం భూమిం పృథివీం బ్రహ్మచారీ భిక్షామా జభార ప్రథమో దివం చ ।
తే కృత్వా సమిధావుపాస్తే తయోరార్పితా భువనాని విశ్వా ॥ 9

इमां भूमिं पृथिवीं ब्रह्मचारी भिक्षामा जभार प्रथमो दिवं च ।
ते कृत्वा समिधावुपास्ते तयोरार्पिता भुवनानि विश्वा ॥ ॥९॥

It is the Brahmacharin who is the first to get this spacious earth and the heavens as his alms which he offers as two sticks in the Yajna fire and worships God, (As) all the worlds are established in these two (they also fall to his share).

ఓం అర్వాగన్యః పరో అన్యో దివస్పృష్ఠాద్గుహా నిధీ నిహితౌ బ్రాహ్మణస్య ।
తౌ రక్షతి తపసా బ్రహ్మచారీ తత్కేవలం కృణుతే బ్రహ్మ విద్వాన్ ॥ 10

अर्वागन्यः परो अन्यो दिवस्पृष्ठाद् गुहा निधी निहितौ ब्राह्मणस्य ।
तौ रक्षति तपसा ब्रह्मचारी तत् केवलं कृणुते ब्रह्म विद्वान् ॥ ॥१०॥

The two treasuries of divine lore kept concealed, one this side and the other beyond the other side of the heavens (Ether). The Vedic student, with his fervour protects the two and knowing the Supreme being make him alone the object to serve.

ఓం అర్వాగన్య ఇతో అన్యః పృథివ్యా అగ్నీ సమేతో నభసీ అన్తరేమే ।

తయోః శ్రయన్తే రశ్మయోఽధి దృఢాస్తానా తిష్ఠతి తపసా బ్రహ్మచారీ॥ 11

**अर्वागन्य इतो अन्य: पृथिव्या अग्नी समेतो नभसी अन्तरेमे ।**

**तयो: श्रयन्ते रश्मयोऽधि दृढास्ताना तिष्ठति तपसा ब्रह्मचारी ॥ ॥११॥**

The heats proceeding from these two fires, one here on the earth and the other far way from it, meet between two inter-related regions the earth and the heavens. Their rays firmly resort to earthly objects, and the continent Vedic student by his austere life, benefits himself by them as well as makes them more useful to others.

ఓం అభిక్రన్దన్ స్తనయన్నరుణః శితిఙ్గో బృహచ్ఛేపోఽను భూమౌ జభార ।

బ్రహ్మచారీ సిఞ్చతి సానౌ రేతః పృథివ్యాం తేన జీవన్తి ప్రదిశశ్చతస్రః ॥ 12

**अभिक्रन्दन् स्तनयन्नरूण: शितिङ्गो बृहच्छेपोऽनु भूमौ जभार ।**

**ब्रह्मचारी सिञ्चति सानौ रेत: पृथिव्यां तेन जीवन्ति प्रदिशश्चतस्त्र:॥ ।१२।**

Like brown cloud that roraring noisily moves about betwen light and darkness and pouring down rain on mountains and plains brings great fertility to the earth the Vedic student going about on summits of the mountains and low land wherever there are people-preaching at the top of his voice pours down true knowledge everywhere and like the sun dispelling the darkness of ignorance imparts great strength to the earth whereby creatures in all the quarters live.

ఓం అగ్నౌ సూర్యే చన్ద్రమసి మాతరిశ్వన్బ్రహ్మచార్య ప్సు సమిధమా దధాతి ।

తాసామర్చీంషి పృథగభ్రే చరన్తి తాసామాజ్యం పురుషో వర్షమాపః ॥ 13

**अग्नौ सूर्ये चन्द्रमसि मातरिश्वन् ब्रह्मचार्य १ प्सु समिधमा दधाति ।**

**तासामर्चींषि पृथगभ्रे चरन्ति तासामाज्यं पुरूषो वर्षमाप: ॥ ॥१३॥**

(God the sustainer of the universeis) the Divine Brahmachari (who) puts heat, energy everywhere-in fire, in the Sun, in the Moon, in

the atmosphere, in the waters. The spreading flames of these waters are seen in moving in the clouds in various ways and their essence appears ultimately in the form of rain, human beings and other creatures.

ఓం ఆచార్యో మృత్యుర్వరుణ ః సోమ ఓషధయః పయః ।
జీమూతా ఆసన్త్సత్వానస్తైరిదం స్వ రాభృతమ్ ॥ 14

**आचार्यो मृत्युर्वरुणः सोम ओषधयः पयः ।**
**जीमूता आसन्त्सत्वानस्तैरिदं स्व १ राभृतम् ॥ ॥१४॥**

God ordains everything for the good of the creatures, rain, moonlight, death etc, according, as the Universe, in His Ommi-science, needs. The Preceptor also should assume a similar role in discharging his duty towards those under him, sometimes putting down evil with the severity of death, sometimes imparting peace and dealing leniently like the cool and charming moon, as circumstances demand.

ఓం అమా ఘృతం కృణుతే కేవలమాచార్యో భూత్వా వరుణో యద్యదైచ్ఛత్ప్రజాపతౌ।
తద్బ్రహ్మచారీ ప్రాయచ్ఛత్స్వాన్మిత్రో అధ్యాత్మన ః ॥ 15

**अमा घृतं कृणुते केवलमाचार्यं भूत्वा वरुणो यद्यदैच्छत् प्रजापतौ ।**
**तद् ब्रह्मचारी प्रायच्छत् स्वान्मित्रो अध्यात्मनः ॥ ॥१५॥**

A man of parts himself a former Brahmacharin, having an insight into human nature, assuming the role of the preceptor, should impart to his own circle (of pupils and friends) for use of whatever he desires in God, the protector of creatures. This, his student of subdued passions, with due authority hands on in a friendly manner to his own friends.

ఓం ఆచార్యో బ్రహ్మచారీ బ్రహ్మచారీ ప్రజాపతి ః।
ప్రజాపతిర్వి రాజతి విరాడిన్ద్రో ఒ భవద్వశీ ॥ 16
**आचार्यो ब्रह्मचारी ब्रह्मचारी प्रजापतिः ।**
**प्रजापतिर्वि राजति विराडिन्द्रोऽभवद् वशी ॥** ॥१६॥

The preceptor is continent and continent is lord of the house. Through this continence the man in house-holding life shines throughout and the shining soul, the master of organs become powerful to subdue all passions.

ఓం బ్రహ్మచర్యేణ తపసా రాజా రాష్ట్రం వి రక్షతి ।
ఆచార్యో బ్రహ్మచర్యేణ బ్రహ్మచారిణమిచ్ఛతే ॥ 17
**ब्रह्मचर्येण तपसा राजा राष्ट्रं वि रक्षति ।**
**आचार्यो ब्रह्मचर्येण ब्रह्मचारिणमिच्छते ॥** ॥१७॥

The king through the practice and strict discipline of continence or having restraints on sexsual pursuit rules his realms to safety. The preceptor desires to keep the pupil under his control through practice and discipline of continence or chastity.

ఓం బ్రహ్మచర్యేణ కన్యా 3 యువానం విన్దతే పతిమ్ ।
అనడ్వాన్బ్రహ్మచర్యేణాశ్వో ఘాసం జిగీర్షతి ॥ 18
**ब्रह्मचर्येण कन्या ३ युवानं विन्दते पतिम् ।**
**अनड्वान् ब्रह्मचर्येणाश्वो घासं जिगीर्षति ॥** ॥१८॥

A maiden living in chasity by controlling her senses wins for her husbandship a young bachelor of similar qualifications. Even bulls, horses and beasts nourish theselves with fodder (grass) and keep their sexual appetite in control.

ఓం బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుమ పాఘ్నత ।
ఇన్ద్రో హ బ్రహ్మచర్యేణ దేవేభ్యః స్వ రాభరత్ ॥ 19

**ब्रह्मचर्येण तपसा देवा मृत्युमपाघ्नत ।**

**इन्द्रो ह ब्रह्मचर्येण देवेभ्यः स्व १ राभरत् ॥** ॥१९॥

Through the practice and discipline of continence the wise men overcome the causes of early death. The soul, who is the master of limbs and organs, through restraints on hunting after senses brings light and happiness for the limbs of the body.

ఓం ఓషధయో భూతభవ్యమహోరాత్రే వనస్పతిః ।

సంవత్సరః సహర్తుభిస్తే జాతా బ్రహ్మచారిణః ॥ 20

**ओषधयो भूतभव्यमहोरात्रे वनस्पतिः ।**

**संवत्सरः सहर्तुभिस्ते जाता ब्रह्मचारिणः ॥** ॥२०॥

Herbs and plants, the stages of the world that are past and those that are yet to come, day and night, trees, the year all follow the law of seasonal succession, change and fructification and are therefore, the observer of the law of restraint.

ఓం పార్థివా దివ్యాః పశవ ఆరణ్యా గ్రామ్యాశ్చ యే ।

అపక్షాః పక్షిణశ్చ యే తే జాతా బ్రహ్మచారిణః ॥ 21

**पार्थिवा दिव्याः पशव आरण्या ग्राम्याश्च ये ।**

**अपक्षाः पक्षिणश्च ये ते जाता ब्रह्मचारिणः** ॥२१॥

Animals winged and wingless, those that fly in the air and those that live on land, those that be-take themselves to the forest and those that live in a domesticated state in human habitations, all observe the law of restraint in sexual matters.

ఓం పృథక్సర్వే ప్రాజాపత్యాః ప్రాణానాత్మసు బిభ్రతి ।

తాన్త్సర్వాన్బ్రహ్మ రక్షతి బ్రహ్మచారిణ్యాభృతమ్ ॥ 22

**पृथक् सर्वे प्राजापत्याः प्राणानात्मसु बिभ्रति ।**

**तान्त्सर्वान् ब्रह्म रक्षति ब्रह्मचारिण्याभृतम्** ॥२२॥

All the creatures created by God, the protector of creation, hold in themselves, the vital airs separately and Divine knowledge stored in man observing continence and sexsual pursuits protects them all.

ఓం దేవానామేతత్పరిషూతమనభ్యారూఢం చరతి రోచమానమ్ ।
తస్మాజ్జాతం బ్రాహ్మణం బ్రహ్మ జ్యేష్ఠం దేవాశ్చ సర్వే అమృతేన సాకమ్ ॥ 23
देवानामेतत् परिषूतमनभ्यारुढं चरति रोचमानम् ।
तस्माज्जातं ब्राह्मणं ब्रह्म ज्येष्ठं देवाश्च सर्वे अमृतेन साकम् ॥२३॥

The resplendent Vedic Lore obtaining everywhere and never over-powered impels all the luminous worlds. From the man of restraint Supreme Divine Knowledge and ever increasing wealth spring and all the wise attain immortiality.

ఓం బ్రహ్మచారీ బ్రహ్మ భ్రాజద్బిభర్తి తస్మిన్దేవా అధి విశ్వే సమోతాః ।
ప్రాణాపానౌ జనయన్నాద్ వ్యానం వాచం మనో హృదయం బ్రహ్మ మేధామ్॥ 24
ब्रह्मचारी ब्रह्म भ्राजद् बिभर्ति तस्मिन् देवा अधि विश्वे समोताः ।
प्राणापानौ जनयन्नाद् व्यानं वाचं मनो हृदयं ब्रह्म मेधाम् । ॥२४॥

When the continent Vedic student acquires vedic learning, all good qualities fully intermingle in him and he become resplendent. He reveals perfect mastery of his inhalation and exhalation of the vital airs in his person, good eloquence, a powerful mind, pure heart, true knowledge of God and marvel wisdom.

ఓం చక్షుః శ్రోత్రం యశో అస్మాసు ధేహ్యన్నం రేతో లోహితముదరమ్ ॥ 25
चक्षुः श्रोत्रं यशो अस्मासु धेह्यन्नं रेतो लोहितमुदरम् । ।२५॥

To such an accomplished continent man people should approach and request him thus, Oh sir! you are well- versed in these

matters help us to attain a good power of sight and heiring a fame, food, virility, (purity of ) blood, and power of digestion.

ఓం తాని కల్పద్ బ్రహ్మచారీ సలిలస్య పృష్ఠే తపో౽తిష్ఠత్తప్యమానః సముద్రే ।
స స్నాతో బభ్రుః పిఙ్గలః పృథివ్యాం బహు రోచతే ॥ 26

तानि कल्पद् ब्रह्मचारी सलिलस्य पृष्ठे तपोऽतिष्ठत्
तप्यमानः समुद्रे ।
स स्नातो बभ्रुः पिङ्गलः पृथिव्यां बहु रोचते ॥ ॥२६॥

Standing on the surface of the waters of learning in the unfathomable sea of the stage of Brahmacharya, exerting himself to control his senses and performing the duties assigned to him, the vedic student plunges himself (in the sea of learning), so to say, and bathing therein comes out having stored in himself immense knowledge and shines most brilliantly in the world.

## మేధా సూక్తం

ఋషిః – శౌనికః ॥ దేవతా – 1,2,3,5, మేధా ॥ 4 అగ్నిః ॥

## मेधा सूक्त

ऋषिः - शौनकः ॥ देवता - २-३,५ मेधा,४ अग्निः ॥

छन्दः - १,४,५ अनुष्टुप्, २ उरोबृहती, ३ पथ्या बृहती ॥

HYMN - CVIII

Seer- Shaunakah. Subject - matter - 1-3,5, Medha, 4 Agnih. Metre - 1,4,5, Anustup. 2 Urobrihati, 3 Pathya Brihati.

ఓం త్వం నో మేధే ప్రథమా గోభిరశ్వేభిరా గహి ।
త్వం సూర్యస్య రశ్మిభిస్త్వం నో అసి యజ్ఞియా ॥ 1

त्वं नो मेधे प्रथमा गोभिरश्वेभिरा गहि ।
त्वं सूर्यस्य रश्मिभिस्त्वं नो असि यज्ञिया ॥ ॥१॥

Let this knowledge of the Vedic revelation which is primordial, come to us with its brilliant rays and comprehensive projections. Let it come to us with the livings of the effulgence of all-impelling God. This knowledge is full of sacredness and perspicacity.

ఓం మేధామహం ప్రథమాం బ్రహ్మణ్వతీం బ్రహ్మజూతామృషిష్టుతామ్ ।
ప్రపీతాం బ్రహ్మచారిభిర్దేవానామవసే హువే ॥ 2
मेधामहं प्रथमां ब्रह्मण्वतीं ब्रह्मजूतामृषिष्टुताम् ।
प्रपीतां ब्रह्मचारिभिर्देवानामवसे हुवे ॥ ॥२॥

I for the security of virtuous qualities call to my mind and memory the knowledge which is primordial, full of wisdom, God - revealed, grasped and praised by seers and is fully drunk by celibates.

ఓం యాం మేధామృభవో విదుర్యాం మేధామసురా విదుః ।
ఋషయో భద్రాం మేధాం యాం విదుస్తాం మయ్యా వేశయామసి ॥ 3
यां मेधामृभवो विदुर्यां मेधामसुरा विदुः ।
ऋषयो भद्रां मेधां यां विदुस्तां मय्या वेशयामसि ॥ ॥३॥

We secure into me that knowledge which is attained by the men of perspicacious effulgence, that which is attained the men of spiritual attainments and that good one which is attained by the seers.

ఓం యామృషయో భూతకృతో మేధాం మేధావినో విదుః ।
తయా మామద్య మేధయాగ్నే మేధావినం కృణు ॥ 4
यामृषयो भूतकृतो मेधां मेधाविनो विदुः ।
तया ममद्य मेधयाग्ने मेधाविनं कृणु ॥ ॥४॥

O Self-refulgent God! make me wise with that of the knowledge

which the wise seers of the primal emergence attain and retain.

ఓం మేధాం సాయం మేధాం ప్రాతర్మేధాం మధ్యన్దినం పరి ।
మేధాం సూర్యస్య రశ్మిభిర్వచసా వేశయామహే ॥ 5

मेधां सायं मेधां प्रातर्मेधां मध्यन्दिनं परि ।
मेधां सूर्यस्य रश्मिभिर्वचसा वेशयामहे ॥ ॥५॥

We cultivate into us the intelligence at eve, at morning and at the noon time. We attain it through speech and through the beams of the knowledge of the Divinity.



యజ్ఞోవై శ్రేష్ఠతమం కర్మ

ఓ౩మ్ శాంతిః శాంతిః శాంతిః.

# వైదిక సంస్కృతీ పునరుద్ధారకుడు

**ప్రశ్న :** స్త్రీలు, శూద్రులు యజ్ఞోపవీతమును ధరించవచ్చునా ? వేదమును చదువ వచ్చునా ?

**ఉత్తరము :** యజ్ఞోపవీతము ధరించ వచ్చును. వేదము చదువ వచ్చును. స్త్రీ శూద్రులకు వేదాధ్యయనాధికారము నిషేధించుటకు, ఏమి ఈశ్వరుడు పక్షపాతియా ? 'స్త్రీ శూద్రులు వేదమును చదువరాదు, వినరాదు' అని అతని యభిప్రాయమేని వారి శరీరములందు వాక్కును శ్రోత్రేంద్రియమును ఏల రచించెను ?



మహర్షి దయానంద సరస్వతి

పృథివ్యాది పంచభూతములను, సూర్యచంద్ర అన్నాది పదార్థములను మానవులకొరకు సృజించినట్లే పరమేశ్వరుడు వేదము అందరికొరకు ఉపదేశించినాడు. అందుకు మాకు ఈశ్వరీయమైన వేదమే పరమ ప్రమాణము. 'స్త్రీశూద్రౌ నాధీయతా మితి శ్రుతేః' అను మాటలు మీ కపోల కల్పితములు. ప్రాచీనకాలమున స్త్రీ శూద్రులు యజ్ఞోపవీతము ధరించి వేదాధ్యయనము చేయుటయేగాక వేదమంత్రార్థ ద్రష్టలై ప్రచారకులైన ఋషులు, ఋషికలు ఎందరో గలరు.

**– మహర్షి దయానంద సరస్వతి**

('సత్యార్థ ప్రకాశము' – 3వ సముల్లాసము)

యజ్ఞోపవీతమును గురించి ....

## స్వామి వివేకానందుని అభిప్రాయం

"ఈనాడు శ్రీ గురుదేవుల (శ్రీ రామకృష్ణుని) జన్మతిథి. మహాపవిత్రమైన రోజు. ఈ రోజున ఆ మహాత్ముని పేరు తలంచినంత మాత్రం చేతనే మానవులు పునీతులు కాగలరు. కనుక ఈ రోజున ఇచ్చటికి వచ్చు భక్తులందరికి నేను స్వయంగా యజ్ఞోపవీతం ప్రదానం చేస్తాను. కాలక్రమంలో ఒక్క శ్రీరామకృష్ణ భక్తులను మాత్రమే కాకుండా, దేశ ప్రజలందరిని బ్రాహ్మణస్థాయికి సముద్ధరించాలి."

ఆ దినమున స్వామి అభీష్టము ననుసరించి సుమారుగా యాభై మంది పురుషులు శరచ్చంద్ర చక్రవర్తి ద్వారా గాయత్రీమంత్ర దీక్షను గైకొని యజ్ఞోపవీత ధారణ గావించారు. వారిని చూచి స్వామి ముఖం ఆనందంతో వెలిగిపోయింది. సంకుచిత విభేదాలు సమసిపోయి సర్వజనులు అత్యున్నత ఆధ్యాత్మిక స్థాయికి సముద్ధరింపబడవలెనను స్వామి ఉదారాశయం ఆచరణ పూర్వకంగా అమలు జరిగిన ఆరంభదిన మది.

(ఈ సంఘటన నీలాంబరబాబు ఉద్యాన గృహంలో తాత్కాలికంగా నెలకొన్న మఠమునందు 1898 సంవత్సరంలో జరిగింది.)

- **"శ్రీరామకృష్ణ ప్రభ"** (ఏప్రిల్, 1989)

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స (40-00), వేదాలలో జలచికిత్స (20-00), వైదిక క్రాంతి పథం (15-00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము (15-00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణిస్త్రీ) (20-00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (20-00), గర్భధాన విజ్ఞానము (30-00), మానవ ధర్మము (20-00), అశ్వినీ దేవతలు (20-00), సంధ్యా వందనము - వైజ్ఞానిక సమాలోచనము (20-00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30-00), గంగాధర శివుడు (5-00), గోమాత (30-00), గాయత్రీ విజ్ఞానం (50-00), జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ (60-00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు (10-00), దైనిక అగ్నిహోత్రవిధి (4-00), మన ఇతిహాసం (70-00), మన వేదశాస్త్రాల పరిచయం (50-00), చతుర్దశ భువనములు (10-00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10-00), యుగపురుషుడు శ్రీ కృష్ణుడు (8-00), వైదిక వివాహ వైశిష్ట్యము (8-00), ధర్మవీర్ పం. లేఖరామ్ (3-00), వేదాలలో అప్సరస గంధర్వులు (2-50), యజ్ఞోపవీత వైశిష్ట్యము (2-00), లక్ష్మీ సూక్తము (2-00), శాంతి ప్రార్థన (2-00), దగ్రేట్ గాయత్రి (2-00), వైదిక అర్థనీతి (2-00), బ్రహ్మచర్య విజ్ఞానము (15-00), శ్రీ దయానంద హృదయము (12-00), స్వరాజ్య సంగ్రామంలో ఆర్యసమాజము (8-00), సత్యధర్మవిచారణ (6-00), వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం (10-00), మరణానంతరం జీవుని ప్రయాణము (40-00), ప్రణవ స్తోత్రం (10-00), అహల్య రాయిగా మారలేదు (2-00), దయానందుని ఆదర్శరాజ్యం (1-00), మాతాపుత్రికల జ్ఞానచర్చ (60-00), వేదాల వెలుగు చూపే ఆర్యసమాజము (20-00), వైదిక సరస్వతీ సూక్తము (10-00), అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం (60/-). పెండ్లినాటి ప్రమాణాలు (40/-), వేదాలలో వర్షేష్టి విజ్ఞానం (25/-), దేవుడు-జీవుడు-ప్రకృతి (30/-), వైదిక జన్మదిన వేడుక (30/-) యజ్ఞోపవీత వైశిష్ట్యము - బ్రహ్మచర్య విశిష్టత, వేదోపదేశాలు (ముద్రణలో).



## సృష్టికర్త ఉపదేశం

**ఓం బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుమపాఘ్నత ।**
**ఇంద్రో హ బ్రహ్మచర్యేణ దేవేభ్యః స్వరాభరత్॥**

– అథర్వవేదం (11-5-19).

దేవతలు - విద్యా సదాచార పరులైన వివేకవంతులు బ్రహ్మచర్యంతో, ద్వంద్వ సహనరూప తపస్సుతో మృత్యువును, దరిద్రాన్ని, కష్టాలను అధిగమించి సుఖపూర్వకంగా దీర్ఘాయువు ననుభవిస్తారు. ఇంద్రుడు - ఇంద్రియాలకు అధిపతియైన జీవుడు ఇంద్రియాలను వశంలో పెట్టుకొని తన శరీర మనో బుద్ధులను బలపరచుకుంటాడు. పురుషార్థంచేసి విశేష సుఖాల నను భవిస్తాడు. యోగసాధన చేసి అమరత్వాన్ని - ముక్తిని పొందుతాడు.

Through the practice and discipline of continence the wisemen overcome the causes of early death. The soul, who is the master of limbs and sense organs, through restraints on hunting after senses brings light and happiness for the limbs of the body.

Read Fully and give others

YAGNOPAVEETA VAISHISHTIYAMU




## సర్వవ్యాపక సర్వేశ్వరుని సందేశం

ఓం బ్రహ్మ చర్యేణ కన్యా యువానం విందతే పతిమ్ ।
అనడ్వాన్ బ్రహ్మచర్యేణ+అశ్వా ఘాసం జిగీర్షతి॥

- అథర్వవేదం (11-5-18).

కన్యలు (విద్యార్థినులు) కూడా బ్రహ్మచర్య వ్రతాన్ని (తపస్సును) పాటించి శరీర మనో బుద్ధులను బలపరచుకోవాలి. దృఢమైన శరీరాంగాలతో వీర యువతలు కావాలి. తమకు తగిన బల వీర్య బ్రహ్మచర్యవ్రత సంపన్నులైన యువకులను వివాహమాడి ఆదర్శ గృహిణులు కావాలి. "మమ పుత్రాః శత్రుహణో+అథో మే దుహితా విరాట్...... (అథర్వ 10-159-3)= నా పుత్రులు శత్రుంజయులు. నా పుత్రికలు విశ్వవందితలు, వీరమాతలు " అని చెప్పగల - గర్వించగల నారీమణులు కావాలి.

బరువైన బండిని, రథాన్ని వేగంగా తీసుకుపోగల వృషభ అశ్వాలు గడ్డిపరకలు తిని కూడా బ్రహ్మచర్యవ్రతాన్ని పాటించి అంతటి శక్తిని పొందాయి. అట్లే, విద్యార్థినీ విద్యార్థులు బ్రహ్మచర్య వ్రతాన్ని పాటించి బల వీర్య సంపన్నులు కావాలి.

A maiden living in chasity by controlling her senses wins for her husbandship a young bachelor of similar qualifications. Even bulls, horses and beasts nourish themselves with fodder (grass) and keep their sexual appetite in control.

ముద్రణ- వితరణ

**రావికంటి జ్యోతిశ్రీ - దీనదయాళ్**

వైదిక ధర్మ ప్రచారకులు, వారాసిగూడ, సికింద్రాబాద్

సెల్ : 9440871326, 9705085608